# కృతజ్ఞత

[ చరిత్రాత్మకము ]

Approved by the Andhra Text book Committee as Nondetailed Text for form IV to VI and Published in the Andhra Gazette ~~1173 page dated 29=9=55~~.

రచయిత:

విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

[ వీరేశలింగాస్తికోన్నత పాఠశాలా సీనియరు పండితులు ]

రాజమండ్రి

1955



[ వెల రు 1-0-0

# తొలి మాట

నేఁటి పాఠకులకుఁ జారిత్రికదృష్టి మిక్కిలి యవసరము. కేవలముఁ జరిత్రపఠనమునఁగాక, కథారూపమున దాని నలవఱుచుకొనుటయన్న నందఱకు, ముఖ్యముగా బాలురకు, విద్యార్థులకు నానందదాయకము.

ఈగ్రంథరచనమున కాంధ్రసీమ నడిగడ్డపై సుమారు రెండుశతాబ్దములకుఁ బూర్వము ఘటిల్లిన ప్రసిద్ధమగు నితివృత్త మాధారము. చారిత్రికపాత్రలఁ గథానుగుణముగాఁ బోషించుటకై కొలఁదిమార్పులను గావించితిని; కాని చరిత్ర విరుద్ధాంశములఁ గల్పింపలేదు. కొన్ని చారిత్రికములుగాకున్నను నానాఁటి సాంఘిక పరిస్థితులఁ దెలుపుటకును, నుత్తమాదర్శములఁ బ్రకటించుటకును గల్పింపఁబడినవి. ఇందలియుత్కృష్టతను గ్రహించి పఠితలు వీలయినంతవఱకు నలవఱుచుకొనఁగలరని నాయాశయము.

గ్రంథరచనోద్దేశ మెఱిఁగి లిఖితభాగములఁ జదివి వినిపింప నాదరముతో విని నాకు మిక్కిలి ప్రోత్సాహ మొసఁగిన **Dr. D. S. RAJU**, M. B. B. S., L. R. C. P, M. R. C. S, M. R. C. P. (Lond) Maj. I. M. S. (Retd.) Ex. Col. (I. N. A) గారికి వందనములు.

ఈ గ్రంథమునకు సంపూర్ణ ప్రోత్సాహ మొసఁగి తృతీయ ముద్రణమున కవకాశము కల్పించిన పాఠకులకును, విద్యాశాఖాధికారులకును కృతజ్ఞుఁడను.

పెద్దాపుర సంస్థాన చరిత్రమును, తద్వివమర్శనమును, పెద్దాపురము ముట్టడి నాటకమునుననేకాంధ్రాంగ్ల గ్రంథములును నాకుఁ జరిత్రాంశసేకరణమునఁ దోడుపడినవి. ఏతద్గ్రంథరచయితలకును బ్రచురణకర్తలకును గృతజ్ఞుఁడను.

అక్టోబరు 1955. గ్రంథకర్త.

# విషయసూచిక

# కృతజ్ఞత

## 1. మార్గస్థులు

అది వేకువసమయము. ప్రశాంత పవనములు మంద మందముగ వీచుచుఁ దరులతానికుంజముల నించుక కదలించు చుండెను. రేయియంతయు సుఖనిద్రఁ గాంచి యపుడే మెలఁ కువనొందిన పక్షిజాతములు తమ కులాయములనుండియే కిల కిలారావములు గావించుచుండెను. నిబిడాంధకారముఁ జీల్చు కొని తూరుపుదెసనుండి యరుణకిరణజాతమగు నీషద్ధవళిమ యాగంతుకుల నాహ్వానించుచుండెనో యనునట్లు తోఁచు చుండెను. మింటనున్న తారకాసముదయములు శత్రుపరా జితులైన క్షత్రియవీరుల మోములవలెఁ గాంతిహీనములై తెల తెల వోవుచుండెను. గ్రామసీమ లందలి కుక్కుటములు 'నిద్రాసమయము మీఱిపోయినది. మీ మీ కర్తవ్యము లప్రమత్తులై నిర్వర్తింపకున్న దేశోపద్రవము తప్ప' దని మేలుకొలుపుచున్నవో యనునట్లు విరామములేకుండ 'కొక్కొ రోకో' యను నారావము లొనరించుచుండెను. పొలము కాఁపులు హలములు మూఁపున ధరించి గిత్తల నదలించుచుఁ బొలములకుఁ దోలుకొనిపోవునపుడు వాని మెడలలోని చిఱు గంటలు వాని పాదన్యాసమున కనువగు లయతో శ్రావ్య ముగా మొరయుచుండెను.

ఆ సమయమునఁ బావన గౌతమీతీరమున రాజమహేంద్రవరమున కవ్వలియొడ్డున నిరువురు యువకులు నదీతరణమొనర్ప నావకొఱకుఁ జూచుచుండిరి. అందొకనికి ముప్పదేండ్లవయసు, చామనచాయ; కోరమీసములు మెలికలు దిరిగి పరాక్రమమును సూచించుచుండెను. బలిష్ఠములైన యవయవములుఁ, జూపులలోని గాంభీర్యముఁ, గనుబొమల తీరుఁ జూచిన నాతఁ డెవ్వఁడో మహావీరుఁడని తప్పక తోఁచును. రెండవయాతఁడు కొంచెము పచ్చనిచాయగలిగిన యిరువదియైదు వత్సరముల యువకుఁడు. ఆతనిముఖవైఖరి ప్రతాపాతిశయమును సూచించుచున్నను బరిశీలించినవారి కం దంతర్గర్భితమై యాలోచనాశక్తి, ప్రసన్నతయు గోచరించును. ఇరువురును సన్నని తెల్లని నేఁతవస్త్రముఁ దల కుష్ణీషముగాఁ జుట్టుకొనిరి. వారి మొలల వ్రేలాడు నొఱలలోనుండి తళతళమను కత్తులకాంతులు వెలికుబికి తూరుపుదెసకు వెల్లఁదనమాపాదించునట్లుండెను. వారిమొగములు నిద్రాహీనములై యలసి సొలసినట్లుండెను. కనులు గొంచె మెఱ్ఱవాఱి యపుడే వికసించుచున్న యరుణకమలములఁ దలఁపించుచుండెను.

వారి కాసమయమున నెచ్చటను నావలు కాన్పింపలేదు. ఒండు రెండు కాన్పించినను నందు జను లెవ్వరును లేరు. తుదకొక నావలో నావికుఁ డున్నట్లు కనఁబడఁగానే వా రచటికేఁగి పరీక్షింప నందొక్కఁడు మత్తిల్లినవానివలెఁ బడియుండి నడుమనడుమ దొరలుచు గుఱ్ఱులువెట్టుచు నిద్రించుచుండెను.

వారపుడు తమ యుత్తమాశ్వములను నావపై నెక్కించి తామే తెడ్లువేసి దానిని నడపించుకొని తీరముఁ జేరిరి. ప్రజా పాలకులగువారు వీలయినంతవఱకుఁ బాలితుల కసుఖముఁ గలుగనీయరా దని యెంచి కాఁబోలు నందలి నావికుని లేప లేదు. కాని నావనుండి దిగిపోవుచు నందు రెండు నాణెములు పడవైచి తమ యాజానేయముల నధిరోహించి తూరుపు దెసగా వానిని విద్యుద్వేగముగా నడపించుకొనుచు క్షణములో నదృశ్యులైరి. వారెవరో గుర్తించుటకుఁ గాని, ప్రశ్నించుటకుఁ గాని చూచిన జనులెవ్వరికి వీలుగానంత శీఘ్రముగా వారు తమ గుఱ్ఱములను బరువెత్తించిరి.

---

## 2. ఆహ్వానము

అది పెద్దాపురములోని యొక చిన్నగృహము. దాని ముందు వివిధ తరువులుగల చిన్న తోఁట గలదు. అం దచట నచట నిరువురు మువ్వురు కూరుచుండుటకు వీలయిన యరఁగు లున్నవి. ఒకప్రక్క గోశాల, అందుఁ గపిలగో వొకటి, దాని వత్సములు రెండుఁ జాల మనోహరముగాఁ గానఁబడును. ఆవత్సములు తోఁటలోఁ జెంగుచెంగున గంతులువైచునపుడు చూచువారి హృదయములుకూడ వాని వెంట గంతులిడక

మానవు. అచటి వేదికలపై విద్యార్థులు గూరుచుండి వేద ములు వల్లెవేయువారు కొందఱుఁ, గావ్యపఠనము చేయువారు కొందఱు, శాస్త్రములు చదువువారు కొందఱు నై యెల్లవేళల సందడిగా నుందురు. వారు స్నానములు చేసి వృక్షశాఖల నాఱఁగట్టిన మడిదోవతులు గాలికి గదలియాడుచు శ్రోత్రియ లక్ష్మీజయపతాకలువోలె నొప్పుచుండును. గోవుల యంబార వము వేదరవముతో శ్రుతి మేళగించినపుడు చూపఱులు చెవులు నిగిడించి నిశ్చేష్టులై యాలకించుటఁ జూడ నా పవిత్ర రావమునకు వారి పాపము లన్నియుఁ బటాపంచలై వారు గతకల్మషు లగుచుండి రనిపించును. అచటి విద్యార్థుల చదువు లన్నియుఁ బరిశీలించుచు వారి కాయా పాఠములు చెప్పుచు కొంపెల్ల సుబ్రహ్మణ్య సోమయాజులుగా రపరబృహస్పతివోలె నొప్పుచుందురు. ఆయన నిరాడంబర వేషమును, జేత నెల్ల పుడు విడువకయుండు పాత్రము, నాయన శ్రోత్రియత్వమును జాటుచుండును. ముఖమందలి గాంభీర్యము, నాజానులంబము లగు బాహువులతోడి యున్నత విగ్రహము, దీర్ఘాలోచనా పూరితమైన కనులుఁ, గొంచెము ముడుతలువడిన మోము, నాయన కేవలము ఛాందసుఁడు గాఁడని సూచించుచుండును. సుమా రఱువది వత్సరముల ప్రాయమునను నాయన శరీర పాటవము సడలలేదు.

ఒకనాఁ డాయన యిరువురు శిష్యులకు వేదసంహిత సంతచెప్పుచుండఁగా నొక కావ్యవిద్యార్థి వచ్చి, 'రాజభటుఁడు

తమ దర్శనము గోరుచున్నా' డని విన్నవించెను. వేచి యుండుమని రాజభటునకుఁ గబురంపి, వారికి సంతచెప్పుచున్న యధ్యాయము ముగించి యాయన వీధి యరఁగుమీఁదకు వచ్చెను. రాజభటుఁ డాయనకు నమస్కరించి యొకలేక యం దిచ్చెను. సోమయాజులుగా రా లేఖఁ జదివికొని 'యొక గడి యలో వచ్చెద' నని యాతనికిఁ జెప్పి పంపివైచిరి. చిన్న విద్యార్థులకుఁ బాఠములు చెప్పుటకుఁ బెద్ద విద్యార్థులను నియమించి, మిగిలినవారికిఁ బూర్వపాఠములు వల్లెవేయు చుండుఁడని చెప్పి, యింటియొద్దఁ గావలసిన సర్దుబాటు లొనరించి కొని సోమయాజులుగారు రాజభవనమునకు బయలుదేఱిరి.

గురువుగారు బయలుదేఱి వెడలినతరువాత నిరువురు శాస్త్రపాఠకులగు పెద్ద విద్యార్థులు తమ వల్లె ముగించు కొని సంభాషణమున కుపక్రమించిరి.

'గురువుగారి నంత శీఘ్రముగా రమ్మని కబురంపుటకుఁ గారణమేమో !'

'ఏదో విశేషమైన రాచటికపుఁ బని గలిగియుండును. మామూలుపను లయిన మధ్యాహ్నము పిలిపించి యుందురు'

"ఉదయమున నేను చెఱువులో స్నానముచేయుచు న్నపు 'డెవ్వరో యిరువురు తేజోమూర్తులయిన యువకులు ధవళాశ్వముల నధిరోహించి రాజభవనము వైపునకుఁ బోయి' రని యచటికి స్నానమునకు వచ్చినవారు చెప్పుకొనుచుండిరి.

రాజకార్య మేదైనఁ దటస్థించి యుండవచ్చును; కాని యది యెట్టిదో తెలియరాకున్నది.”

“మహారాజు ‘ఉద్దండరాయజగపతి’ యెదురుతిరిగిన పద్మనాయకులను, వారికి సహాయముగా వచ్చిన మహమ్మదీయులను పెక్కుపర్యాయము లోడించి రాజ్యమునకు శత్రు భయములేకుండఁ జేసిరి. ఇంతేకాక పెద్దాపురపు వీరక్షత్రియు లజేయులని, ధర్మ స్వరూపులు, ప్రజాభిమాన పాత్రులు నని యెంచి ముస్లిములు వారితో స్నేహముచేసి కానుకలిచ్చుచు సుహృద్భావమున వర్తించుచుండిరి.”

‘అవును, వారి స్నేహమును మన్నించియే కదా! రుస్తుంఖానుని, నాతని పుత్రుఁడు నూరుద్దీనునిఁ గొలువులో నందఱికన్న నెక్కు డాదరముతోఁ జూచుచున్నది మహా రాజ్ఞి రాగమ్మగారు.’

“అది సరియే. రుస్తుంఖానుఁ డనఁగా జ్ఞప్తికి వచ్చినది. ఆతఁడు వీరికొలువునుండి వెడలి చాలకాలమైనది కాదా! ఆతఁ డీ మధ్య సర్కారులకు ‘సర్లష్క’ రైన యన్వరుద్దీను ఖానుని దయ సంపాదించి క్రమముగా రాజమంద్రికి సర్లష్క రుగా నియమింపఁ బడినట్లు తెలియుచున్నది.”

‘ఆతఁ డేల యిచటఁ గొలువు చాలించుకొనిపోయెను?’

‘ఆఁడుదాని పరిపాలన కసూయ పడుచుండెడివాఁ’ డని యపుడపుడు కొందఱనుకొనువారు. అసలిచటఁ గొలువులో సేవచేసినది రాఘవమ్మగారిని తంత్రములచే మోసపుచ్చి బాలు

రైన రాజపుత్రులను జంపి రాజ్యము హరింపవలయునను నుద్దేశము తోడనే యని కొందఱు భావించెడివారు. కాని బయటికేమాత్రము ననుమానము గలుగనీయక సమర్థతతోఁ బనులు నిర్వహించుచుండుటవలన నాప్రవాదములు క్రమముగాఁ దొలఁగి పోయినవి. తుదకే కారణముననో పెద్దాపురపుఁ గొలువు వీడి, యస్వరుద్దీనునొద్ద, మొదటఁ జిన్నయుద్యోగమునకే సిద్ధపడి నేఁటి కీపదవి నొందెను.'

'రుస్తుంఖాను దుష్టుఁడే యైనచో నాతని కుమారుఁడు మాత్ర మిచట నుండి ప్రభుభక్తిఁ జూపునా?'

'గురువుగారొకసారి చెప్పఁగా వింటిని. తండ్రి యెట్టివాఁడైనను నూరుద్దీన్ మాత్రము నిక్కపు రాజభక్తుఁడు. ఆతనికి హిందూమతమన్న ద్వేషముకాని, ముస్లిము మత మన్న వెఱ్ఱి యభిమానముకాని లేనేలేదఁట. రాజకుమారుల నిమిత్తము, రాజ్యమునిమిత్తముఁ దన ప్రాణములైనఁద్యజించుటకు సర్వదా సంసిద్ధుఁడఁట. 'హిందువులలో నైన నంత స్వామి భక్తుఁడు, విశ్వాసపాత్రుఁడు నుండ' డని గురువుగారి యాశయము.'

'సరే. మన మిఁక వృథాసంభాషణముఁ గట్టిపెట్టి పాఠములు పూర్తి చేయవలయును. ఇతర విద్యార్థు లన్నియు నియమప్రకారము పూర్తి చేసినదియు లేనిదియుఁ జూడవలసి యున్నదికదా!' ఇట్లు వారిరువురు సంభాషణ ముగించి కడమ విద్యార్థులకడకుఁ బోయిరి.

# 3. అభయ ప్రదానము

మహారాజ్ఞి రాఘువమ్మగారును నామె సుతులు శ్రీ తిమ్మజగపతి, శ్రీ బలభద్రజగపతియు ముఫ్వురు నభ్యంతర మందిరమునఁ గూరుచుండి యెవ్వరిరాకకో యెదురుచూచు చుండిరి. రాఘువమ్మగారి వయసు సుమా రేఁబది వత్సరములు. శ్రీ తిమ్మజగపతి యిరువది వత్సరముల వయసులోనుండి సకల రాజలక్షణములు గలిగియుండెను. దబ్బపండువలెఁ బచ్చని కాంతి గలిగియున్న బుగ్గలపై నల్లఁదనమునఁ బరమావధి నొందిన, కొంచెము మెలికలు దిరిగిన నునుమీసములు ప్రపంచమునందలి శత్రురాజుల నందఱ నొక్కమ్మడిఁ గబళింపఁ జాలు కాలసర్పపు నాల్కలవలె భయంకరముగ నుండెను. కనులలోని ప్రసన్నత, నిర్మలత్వముతోడి తేజస్సు నాతనికిఁ బెట్టని నగలై యొప్పుచుండెను. అన్నదమ్ము లిరువుర నొకే సారి చూచిన వారు వేర్వేరు పురుషాకృతులని స్ఫురించు నేమోకాని యాకారమున, నందమునఁ, దేజమున, సుగుణముల, మాతృభక్తియందు నిర్వు రొకే రూపమై కానఁబడుదురు. వారు ముఫ్వురు నేదో ముఖ్యకార్యము నిర్వహింప నాలోచనము జరపుచుండిరి.

"అమ్మా! మేమెన్నఁడు నీయానతి మీఱి యెఱుఁగము. గురువర్యులును గొలఁది నిముసములలో వత్తురు. ఈ విషయమునఁ బెద్దలగు వారితో నాలోచింపకయే చేయుట

యుచితము గాదు. వారికి విన్నవించుటే కాని వారుమాత్రము భిన్నముగా నేల చెప్పెదురు? మనవంశపుఁ జరిత్రము దెలిసి నంతవఱకు శరణాగతులను ద్రోసిపుచ్చుట యేనాఁ డైనఁ గలదా?" అని తిమ్మజగపతి పలుకుచుండఁగానే సేవకుఁడు ద్రోవసూపుచుండ సుబ్రహ్మణ్యసోమయాజులుగారు లోనికి విచ్చేసిరి. వారిని జూచినవెంటనే ముప్వురును లేచి నిలువంబడి యభివందనములు గావించిరి. సోమయాజులుగా రుచితాసన మునఁ గూరుచున్న యనంతరము వారును గూరుచుండిరి.

మహారాజ్ఞి రాఘవమ్మాదేవిగారు "ఆర్యులు మావంశ మునకును, రాజ్యమునకును రక్షయిడిన తేజోవిశాలురు. తామెప్పు డేమి యొనరించినను రాజ్యక్షేమమునకు భిన్నముగా జరిగిన యుదాహరణము మందుకైనఁ గానరాదు. సమయము గాకున్నను ముఖ్యమగు నాలోచన మవసరమై కబురంపవలసి వచ్చినది." అని వినయముతోఁ బలికిరి.

"మనయందలి యవ్యాజవాత్సల్యము వారి నిత్యధర్మ కృత్యములకుఁ గూడ నాటంకము గలిగించుచున్నది" యను శ్రీ తిమ్మజగపతి పలుకులు విని సోమయాజులుగారిట్లనిరి.

"ప్రజాసౌఖ్యమున కేయంతరాయములు గలుగకుండఁ గాపాడుట రాజకుమారులవిధి. వారి ధర్మనిరతిఁ జూచి యానం దించి ప్రోత్సహించుటకన్న మాకు నిత్యధర్మాచరణ మేమి కలదు బాబూ! వినయమున కట్లు పలుకుటే కాని యేకాలము

నను గాంచి యెఱుఁగని మహాప్రజ్ఞతోఁ జల్లనితల్లి రాగమ్మ గారు సకలవ్యవహారములు నప్రమత్తతతోఁ బరిశీలించి నిర్వర్తించుచుండ; నేను జేయు సహాయము మాత్ర మేమున్నది?” నాపుడు బలభద్రజగపతి “పూజ్య గురూత్తమా! మీ యాశీర్వచన మొక్కటే మాకు సహస్రకవచతుల్యమై సదా మమ్ముఁ గాపాడఁగలదు.” అని యందుకొనెను. అపుడు సోమయాజిగారు “మీ యీ సుగుణములవలననే సోదరులిరువురు రాహుకేతూపరాగ రహితులగు సూర్యచంద్రులై చిరకాలయశోదీధితుల వెలుంగఁగలరు.” అని బదులాడెను. ‘రాహుకేతూపరాగ’ మను మాట చెవిఁబడఁగానే యొక్కమాఱు గుండె ‘జల్లు’ మన రాగమ్మగారు ధీరత మీఱ మరలఁ గుదురుపఱచుకొనిరి.

“గురూత్తమా! వింటిరికదా రుస్తుంఖాను రాజమంద్రికి “సర్ లష్కర్” రైననంగతి! ఆతఁడు ససైన్యముగ బయలుదేఱివచ్చుచుండ; మొగలితుర్తి కలిదిండి రామరాజ గారును, నూజవీటి సుబ్బన్నగారును, నాతని రాకుండఁ జేయుటకై యేలూరియొద్ద నెదురుకొనిరట. ప్రచండయుద్ధమునఁ గొన్నివందలమంది యవనసైనికులను రణరంగమునకు బలియొసఁగి, తురుష్కసైన్యములు లెక్కకు మీఱియుండుట వలన నిన్నటిరాత్రి యెవ్వరి కెఱుఁగరాకుండ రాజమహేంద్రవరమునొద్ద గౌతమిదాఁటి, యిచటి కిపుడేవచ్చి యాశ్రయముఁ గోరిరి. వా రలసటఁ దీర్చుకొనుటకు విడిది యేర్పాటుచేసి,

ముందటి కర్తవ్యము సమాలోచించుటకై తల్లిగారు తమకు వర్తమానించి" రని తిమ్మజగపతి విన్నవించెను. రాఘవమ్మగా రందుకొని "వీరు తొందరపడి యెదిరించిరేమో! తమ బల మెఱుంగక కొలఁదిమంది సైనికులతో శత్రుబలములను డీకొన్న నేమిలాభము? ఇప్పుడు వీరి కాశ్రయమిచ్చిన, రుస్తుముఖానుఁ డూరకుండునా? ఇంతవఱకును మన పెద్దాపుర సామ్రాజ్యమును స్వతంత్రముగా గుర్తించి స్నేహముఁ జూపుచున్నవారిని వైరమునకుఁ బిలుచుకొనుట యగునేమో! మనకేల? యని యూరకుండుద మన్నఁ దమ ధన మాన ప్రాణము లొడ్డి ధర్మదీక్షతో శత్రువుల నెదురుకొని మనసాయముఁ గోరియున్న వీరిని విడనాడుట వంశానుగతమై, యకళంకమైన కీర్తికి మచ్చ దెచ్చుకొనుటకాదా? ఇట్టితఱి మమ్ము న్యాయ మార్గమున నడుపవలసిన భారము సర్వము మీదే" యనిరి.

"తల్లీ! సకల విషయములుఁ గూలంకషముగాఁ బరిశీలింపఁ గలుగు మీ బుద్ధిబలమునకు సాటి యెచటఁ గలదు! ఆ ప్రభువరేణ్యు లిరువురు నేమి స్వార్థముఁగోరి యల్పపు దండుతో శత్రువుల నెదుర్కొనిరి? వారచట ఖానునకుఁ గొంతవఱకు బుద్ధిచెప్పి యుండనిచో నీపాటికి యవనవాహిని యెచట నుండెడిదో? కేవలముఁ బన్నుల వసూలే యాతని లక్ష్యమైనచో గణింపరాని యీ సైన్యమేల? ఆతఁడు చిన్న సంస్థానము లన్నియు వశపఱచుకొనఁగోరి వచ్చుచున్నాఁడనియే నా తలఁపు. మనము వీరిని దిరస్కరించి పరిశుద్ధ

త్సాత్రము నవమానించుకొను టొక్కటే మిగులునుగాఁ
యాతని దృష్టి రాజమహేంద్రవరమున కనతిదూరముననున్న
పెద్దాపురముపైఁ బడ దనుటకుఁ దారకాణ యేమికలదు ? ఆతఁ
కట్టి దురుద్దేశమే లేనిచో మన మాతనికిఁ జేయుచున్న యప
రాధము మాత్ర మేమి ? శరణుసొచ్చిన యిరువురు వీరవరులఁ
జేరఁదీయుటకే మనకు స్వాతంత్ర్యము లేకున్న మన కీ రాజ్యము
వలని ప్రయోజన మేమి ? ఇంత మాత్రమున రుస్తుము కయ్య
మునకుఁ గాలుదువ్వినఁ బెద్దాపురపు రాచవీరుల బాహుబల
మొకపరి రుచిచూచి తన యకృత్యమునకుఁ బశ్చాత్తాపముఁ
జెందకమానఁడు. వా రొకవేళ ముందుగఁ దొందరపడి రను
కొన్నను మనయండ జేరినవు డన్నిటికి సిద్ధపడి రక్షించుట
మన ముఖ్యధర్మము. ఈ విషయమున రుస్తుముసుతుఁడు
నూరుద్దీను నభిప్రాయ మెటులున్నదో ? " అని సోమయాజులు
గారు పలికిరి.

అంతట "నాతఁడు తండ్రి వెడలిన తరువాత మాకు సోద
రుని వలె వర్తించుచున్నాఁడు. 'రుస్తుము రాజమహేంద్రవరము
దాఁటి రాఁబూనఁ' డనియు, 'వచ్చినచోఁ దిరుగుముఖము
పట్టునట్లు రామరాజు సుబ్బన్నగారల సాయముతోఁ దా
నొక్కఁడే చేయఁగల్గు' ననియు పలికెను. ఆతఁడు మాటకు
భిన్నముగా నడుచుకొన్న సంఘటన మిన్నినంవత్సరములలో
నొక్కటియైనఁ గానరాదు" అని తిమ్మజగపతి వచించెను.

రాగమ్మగారు మరల నందుకొని "గురువర్యులకుఁ దెలియని సంగతులు లేవు. మా పురోహితముఁ గోరియే యెల్ల పుడు మమ్ముఁ గనిపెట్టి చూచుచుండి రను సంగతి యెన్నటికి మఱువజాలము. వీరి కాశ్రయ మీయక తప్పదు. వీరు నిక్క ముగా మనకు మహోపకారముఁ జేసిరని తలంపవచ్చును. మనమైనను దురుష్కులు విజృంభించి, యాంధ్ర దేశమంతయు నాక్రమించి, పౌరుల ధనమానప్రాణములకు హానిఁ గలిగించు చుండఁ జూచుచు నూరకుండఁజాలము గదా! ఇట్టియెడఁ ద్రోవలోనే కొందఱు సైనికులను వధించి యాంధ్రక్షత్రియుల పౌరుషము, స్వాతంత్ర్యేచ్ఛ కొంత విరోధులకు రుచిచూపినా రీ శౌర్యధనులు. మనము మొదటినుండియు ముస్లిములయెడఁ జూపిన న్యాయభావము, ముఖ్యముగాఁ దనపైఁ, దనకుమా రునిపైఁ జూపిన యాదరము స్మరించి యారుస్తుముఖానుఁ డింతవఱకు రాకయేయుండిన నంతయు మేలే యగును. అట్లు గాక యిదియొక హాని యని యెంచి శత్రుత్వముఁ బూని దం డెత్తినచోఁ బూర్వపువిధముననే మనయావచ్ఛక్తి వినియో గించి తగిన సమాధానముఁ జెప్పఁగలము. కావున వారి నిటకు రావించి యాశ్రయ మొసఁగి తదుపరి యవకాశముఁ బట్టి ఖానుని సైన్యవిశేషములు దెలిసికొంద" మని తెలిపిరి.

ఆపలుకులన్నియు విని రాగమ్మగారి యాలోచన శక్తికి, ధైర్యసాహసములకును మెచ్చి సోమయాజులుగారు మానసమున నభినందించి యొక యుద్యోగిని బిలిపించి

యేమో చెప్పి పంపిరి. కొలఁదినిముసములలో నిరువురు వీరులు లోనఁ బ్రవేశించి రాగమ్మగారికి, సుతులకు, సోమయాజులుగారికి వినయపూర్వకముగాఁ దలలు వంచి నమస్కరించిరి. వారిని దగిన యాసనములఁ గూరుచుండ నియమించి సోమయాజులుగారు "వీరవరేణ్యులారా! భయపడకుఁడు. పెద్దాపురపు వీరు లింతవఱకు శత్రువులకు జడిసి యాశ్రయముఁ గోరినవారిని దిరస్కరించి యెఱుఁగరు. మీస్వాతంత్ర్యేచ్ఛను, మీ యసహాయశూరతను జూచి మిక్కిలి యానందించితిమి. మీ రిచట నిస్సంకోచముగా సౌకర్యము లన్నియు నొంది విశ్రాంతిఁ దీసికొనవచ్చును. అనంతర మవకాశమును బట్టి యుద్ధానుభవములు, గ్రహింపజాలినంతవఱకు రుస్తుంఖాను నుద్దేశములుఁ దెలుపఁగలరు" అని వారికిఁ దెలిపిరి.

ఆ మాటలు విని వీరుఁడగు రామరా జిట్లు బదులు పలికెను. "ఆర్యా! గాంభీర్యవిలసితములు, నమృతోపమానములు నగు మీ భాషణములు మా మార్గశ్రాంతి నామూలముగఁ బోఁగొట్టెను. పెద్దాపుర ప్రభువుల యౌదార్యాది సుగుణములును, దమ ప్రతిభావిశేషములును వేనోళ్ళ విని తమ సన్నిధికి వచ్చితిమి. నాఁడు విన్నవియు, నేఁడు కన్నవియు నొక్కరూపమై మా యపజయ విచారమును జాలవఱకుఁ దొలగించివైచినవి. మేమైనను క్షుద్రమైన ప్రాణముల కాసించి, శత్రువులకు వెన్నిచ్చి పాఱి వచ్చియుండలేదు. స్వార్థము నభిలషించి యుద్ధమునకు సిద్ధపడియుండలేదు. మహమ్మదీయుల

దండయాత్రలో నాంధ్రప్రజానీకమునకుఁ గలుగుచు వచ్చిన ప్రమాదములు కని, విని మాశక్తికొలఁది నిరోధించియే యిపు డిచటికి వచ్చితిమి. మా కిపుడు విశ్రాంతి దీసికొనవలసిన మహాశ్రమ మేమియుఁ గలుగలేదు. కొంత సైన్యము, ధన సాహాయ్యము నొసఁగినచో ఖానుని వీలయినంతవఱ కొక్క యడుగు గూడ ముందునకు రాకుండ నిరోధింపఁగలము.”

అనంతరము రెండవయోధుఁడు నూజవీటి సుబ్బన్న “మిత్రులు రామరాజుగారు విన్నవించిన దంతయు నిక్కము. ఖానుఁడు కేవలముఁ గప్పము వసూలుచేయుటకే వచ్చు చున్నాఁ డనుటకుఁ దగినయాధారములు గానఁబడవు. ఆతని వెంటనున్న సైన్యమున కంతమున్నటులే కన్పింపదు. మానోటి నుండి యామాట రారాదుగాని యాతఁ డేవో కొన్ని క్రొత్త యాక్రమణములు గావింపవచ్చుచున్నాఁ డనియే మాకు నిశ్చ యముగాఁ దోఁచినది. మాయల్పపుఁ బ్రాణములు పోయి నందువలన నే యొక్క మానవునకైన లాభము చేకుఱు నన్న నమ్మకమున్నచో నింకను గొందఱు శత్రువీరుల నుక్కడఁ గించి యుద్ధరంగమున సంతోషముతో నసువులు ద్యజించి వీరస్వర్గముఁ జూఱగొని యుండెడివారము. మేమిట్లు వెను దిరిగి వచ్చినందున నే కొందఱు ప్రజలకు మేలుకలిగినను మాజీవితశేషము ధన్యమని భావింపగలము.” అని వారికి విన్నవించెను.

వారి వీరోచిత వాక్యములకు మహారాజ్ఞియుఁ, గుమారులు నభినందించి, వారికి వలయు సౌకర్యములు గలిగింప నుద్యోగుల కాజ్ఞయొసఁగి వారిని విడుదులకుఁ బంపిరి. సమయము వచ్చినపుడు పిలువనంపుదు మని చెప్పిరి. మాధ్యాహ్నికానుష్ఠానమున కాలస్యమగుచున్న దని గమనించి "గురువర్యా! అసమయమునఁ బిలిచి మీధర్మ కృత్యముల కాలస్యముఁ గలిగించితిమి. క్షమింపుఁ" డని రాగమ్మగారు పలుక సోమయాజులుగారు "తల్లీ! మాధర్మాచరణములన్నియుఁ బ్రజాసౌఖ్యమే పరమావధిగాఁ గలిగిన ప్రభువరుల సేమము నిమిత్తమే" యని సెలవుఁ బుచ్చుకొని గృహోన్ముఖు లయిరి.

---

## 4. రుస్తుంఖాను వృత్తాంతము

సకలకళావిశారదులు, కవిపండిత పోషకులు, ప్రజారంజకులు, శత్రుభయంకరులు నగు నుద్దండరాయజగపతిగారు పెద్దాపుర రాజవంశమున కెనలేని కీర్తిసంపదలు గడించి యిరువదియాఱేండ్లకాలము పరిపాలన మొనరించి 1734 వ సంవత్సర ప్రాంతమున నమరనివాసమున కేఁగిరి. వారి పాలన కాలమునఁ బలుసారులు దండెత్తియు, సామంతులగు పద్మనాయకు లెదురు తిరుగునట్లు ప్రోత్సహించియు, జగపతుల

యౌన్నత్యమును దగ్గింప మహమ్మదీయులు ప్రయత్నించుచు వచ్చిరి. జగపతివర్యులును సహస్రనేత్రములతో సకల విషయములు గనిపెట్టుచు వైరిపీరులు దలయెత్తకుండ నెప్పటికప్పుడు చేయుచు వచ్చిరి. ఇఁక నేమియు లాభములేదని, పౌరుషమునఁ బెద్దాపురమువారి నెదిరించి జయించుట యసాధ్యమని, ప్రజానురాగము వారియెడ బలముగా నున్నదని, యచిరకాలముననే వారి కవగతమయినది. అయినను గొంతకాల మోరిమి వహించియుండి వారితో స్నేహముచేసి సమయము వచ్చినపుడు కపటోపాయముల లోఁగొనవచ్చునని ముస్లిములు తలపోసిరి. కాని యట్టి యవకాశములు లభించుటలేదు. తంత్రజ్ఞుడు, పట్టుదలగలవాఁడు, సామవాక్యముల నిపుణుఁడు నగు రుస్తుంఖానుఁడు కొందఱు తనవారితో శ్రీరాయజగపతి ప్రభువు నాశ్రయించి చిన్నయుద్యోగము లొసగుఁ డని ప్రార్థేయపడి వేఁడుకొనెను.

సహజమగు నౌదార్యముచేతను, నెవరివలన, నే ప్రమాదము రాకుండఁ జూచుకొనఁగల మను నాత్మవిశ్వాసము చేతను, నెల్లకాలము మానసిక ద్వేషములు ప్రబలియుండుట కన్న; నేజాతికి, నేమతమునకుఁ జెందినవారైనఁ బ్రజలంద అన్యోన్యముఁ గలిసియున్న శాంతిసౌఖ్యముల కాకరమై దేశము సుభిక్ష మగుననియు నాప్రభువు వారి కుచితమగు నుద్యోగము లొసఁగి, గౌరవాదరములఁ జూపుచుఁ, జారచక్షువై యందఱియభిప్రాయములఁ గనిపెట్టుచుండెను. వీరిఁ

జేరఁ దీయుట యిష్టముకాని కొందఱు ప్రభుత్వోద్యోగులును గాలక్రమమున వీరివలన నేదోషపురీతులును గానఁబడమి సంతుష్టిఁ జెందియుండిరి. రాయజగపతులు కీర్తిశేషులయిన వెనుక 'రాజ్యపాలన మెవరు చేయుట?' యనుశంక గలిగినది. రాజకుమారులు తిమ్మజగపతివర్యు లప్పటికి యుక్తవయస్కులై యుండలేదు. వారును సోదరులగు బలభద్రజగపతులును మిక్కిలి బాలురై యున్న కారణమున వివేకవతియు, రాజ్యాంగనిపుణురాలును, బ్రజానురాగవతియు నగు రాఘవమ్మాదేవిగారే ప్రభుత్వము వహింపవలయునని యశేషప్రజలును దమ యేకైక వాంఛితముఁ దెలియఁజేసిరి. రాగమ్మగారును వారి కోరిక గాదనలేక ప్రజాసేవాపరాయణులై పురోహితులును, బరమ నైష్ఠికులయ్యు రాజనీతి విశారదులు నగు కొంపెల్ల సుబ్రహ్మణ్య సోమయాజులుగారి ధీసాహాయ్యముతోఁ బరిపాలన మొనరించుచుఁ బ్రజలు పూర్వ మహీపతులను మఱచునట్లు చేయఁగలిగిరి. బాలురును గ్రమముగా విద్యాబుద్ధులు గఱచుచు శౌర్యసాహసోపేతులై వర్ధిలఁ జొచ్చిరి. అవుడపు డొకటి రెండుసారులు శత్రువర్గములు దల యెత్తు సూచనలు గానవచ్చినవి. కాని రాగమ్మగారి చాకచక్యమువలనను, బురోహితుల ధీవిశేషమునను నవి మొదటిలోనే యణఁగిపోయినవి.

ఈకాలముననే యొకనాఁడు కారణ మేమియు లేకుండ రుస్తుంఖాను రాజ్యమును విడిచి యెచటికో వెడలిపోయెను.

తరువాతఁ జాల కాలమున కాతఁడు గోలకొండ ప్రభువుల కళింగ సర్కారులకు 'సర్ లష్కరు' రైన యన్వరుద్దీనుకడఁ జిన్న నౌకరీలోఁ గుదిరినట్లుఁ, గ్రమముగా రాజమహేంద్ర వరమునకు సర్ లష్కరైనట్లుఁ బాఠకులకు విదితమే.

తండ్రి పెద్దాపురపుఁ గొలువు విడనాడి వెడలి పోయినను గుమారుఁడు నూరుద్దీను మాత్ర మేమార్పును లేక మామూలు ప్రకారము తన విధులను నిర్వర్తించుచుం డెను. అందువలన రాజ్ఞియు, రాకొమరులు నాతనిపైఁ బ్రేమాభిమానములు సూపుచుండిరి. పెద్ద లగుచున్న కొలఁదియు రాచబిడ్డలు రాజ్యాంగపరిస్థితు లవగతముఁజేసికొనుచు మాతృదేవియెడలను, బురోహితుల యెడలను నత్యంత భయ భక్తులు గనఁబఱచుచు వినతులై మెలఁగుచుండిరి. ఇట్టి పరి స్థితులలో నేలూరికడ రుస్తుంఖానును స్వాతంత్ర్యాభిలాషతో నెదుర్కొని, యసంఖ్యాకములగు నాతని సేనలతోఁ బోరుట కన్నఁ; దగువారి సాయమొంది శత్రునిరోధముఁ గావించినఁ బ్రజాకోటి కెక్కువ సేవచేసిన వార మగుదు మను నూహతోఁ గలిదిండి రామరాజుగారు, నూజవీటి సుబ్బన్నగారును సంస్థాన మున కరుదెంచిరి. వారిని దగురీతి గౌరవించి శత్రువు దండెత్తినచో నిరోధించుటకుఁ బెద్దాపురమువారు దృఢ నిశ్చ యముతో నుండిరి.

# 5. ఉపాయాన్వేషణము

రుస్తుంఖాను బెద్దాపురమువా రేవిధముగను జిన్న చూపు చూడలేదు. ఆతని బుద్ధివిశేషమునకుఁ, గార్యదీక్షకుఁ దగిన గౌరవమర్యాదలు చూపుచునే యుండిరి. ఆతఁడు కొలువు వీడి యవ్వలికిఁ బోఁదగినంత హేతు వేమియో యెవ్వరికిఁ దెలియరాకుండెను. ఒకస్త్రీ యద్వితీయ మేధా సంపదతో సామ్రాజ్య మేలుచు, సకల సంపద లనుభవించు చుండఁ జూచి యోర్వఁజాలక యాతడు కొంచెము చికాకు పడుచున్న సంగతి రాజ్యమందలి ప్రముఖులలో నే యొక రిద్దఱికో తప్ప మఱెవ్వరికిఁ గొంచెమైన నెన్నఁడుఁ బొడఁగట్ట లేదు. దేశము విడుచునపుడుగూడ మహారాజ్ఞి కాతఁడు వినయ భరితములగు మాటలతో "నమ్మా! నాకుఁ గుటుంబ సంబంధ మయిన కొన్ని సొంతపుఁ బనులున్నవి. తన్నిర్వాహణార్థము కొంతకాలము దేశాంతరమున నుండక తీరదు. తమకు నాకుమారు నొప్పగించి పోవుచుంటిని. ఆతని నున్నతికిఁ దెచ్చు భార మేలిన వారిదే" యని కల్లబొల్లిమాటలుచెప్పి ప్రాధేయపడి వెడలెను. ఆమెయు నాతఁడిదివఱకుఁ జేసిన నిష్కపట సేవ గుర్తించి యుక్తవయస్కుఁడగు నాతని కుమారుఁడు నూరుద్దీనునిఁ దండ్రిస్థానమున గజదళాధ్యక్షునిఁగా నొనరించి మన్నించెను.

"సకలసంపదలతోఁ దులఁదూగుచున్న రాజ్యము నొక యబల పాలించుచున్నది. రాకొమరు లంత ప్రౌఢులుగారు. ఈ రాజ్య మెటులైనఁ జే జిక్కించు కొనవలయు" నని రుస్తుమేనాఁడో సంకల్పించియుండెను. అతని యభిమతమునకు మహా ప్రతిభావంతుఁడుఁ, బ్రభుభక్తిపరుఁడు సుబ్రహ్మణ్యసోమయాజి యెప్పటికప్పుడు ప్రబల ప్రతిబంధకముగాఁ గానఁబడుచుండెను. ఆతడు తన్ను నమ్మిన ట్లుండియు నమ్మక తన ప్రతిచర్యను నిశితముగాఁ బరిశీలించుచున్నట్లు రుస్తుము కనిపెట్టెను. కావి యూరకున్న రాకొమరులు దిట్టలై రాజ్యము మఱింత బలపడిన యనంతర మింకేమియు లాభము కలుగదని ఖానుఁడు నిశ్చయించెను.

ఒకనాఁడు తన యనుంగుఁ బుత్రుఁడగు నూరుద్దీనుతోఁ "దండ్రి కుమారా! మహాపౌరుషము గలిగియుఁ బరుల యాడిగముసేయు నీదురవస్థనుండి మన కేనాఁటికైన విముక్తి గలదా?" యని ప్రస్తావించెను. కుమారుఁడు "పూజ్యుఁడవగు నోతండ్రీ! నీనోటినుండి యిట్టిపలుకులు బయలువెడలునని యెప్పుడుఁ దలఁచియుండలేదు. మన పౌరుషమున కిపు డేమి కొఱఁత గలిగినది? తోడిరాజవీరులతోఁ దుల్యముగను, గొన్ని పట్టుల నధికముగను మనలను రాకొమరులును, మహారాజ్ఞియు గౌరవించుచుండిరికదా! ఏమతమువా రెట్టి యారాధన మేవిధముగఁ జేసికొనుచున్నను భేదము పాటింపఁబడుటలేదు కదా! కొన్ని హిందువుల యుత్సవములలో మహమ్మదీయులును,

వారి వేడుకలలో వీరును నత్యంతోత్సాహముతోఁ బాల్గొని యొకేతల్లి బిడ్డలవలె నీ యిరుతెఱఁగులవారును వర్తించు చుండ నీ కిట్టి తలఁపేల కలుగవలయును? సోమయాజులుగా రెపుడో యొక తుఱకను శిక్షించినమాట నిజమే కావచ్చును. వాఁడు తుంటరియై వారి పూజావృక్షములు బాడుసేయుచు బుద్ధిపూర్వకముగా నాయనను దూషింపఁగా నట్లొనర్చిరి. ఆతుఱకయే నీగృహప్రాంగణమున నట్టియనుచిత మొనరించిన నీవైన శిక్షింపకుండ నుందువా? హైందవులకు కుట్రదారు లెవ్వరైనఁ దలయెత్తినపుడు మనమందర మొక్కటై వారిఁ జక్కాడుట లేదా?" యని తండ్రిని బ్రశ్నించెను.

దానికిఁ దగినసమాధాన మేమియు స్ఫురింపక రుస్తుము "కుమారా! వీరుఁ డన్నవానికి రాజ్యముపై నాస యుండుట సహజము కావున నట్లంటిని. నాయనా! నాకు సగముకాలము గడచినది. రాజ్యమైనను సంపదలైనను నేకైకసుతుఁడవు నీనిమిత్తమే కదా! నీశ్రేయమునకన్న నాకు వేఱేమి కావలయును? తరుణమున నీహృదయము, నీ కుతూహలము నెట్లుండునో యొకసారి తెలిసికొనఁ గోరి యిట్లంటిని. ఈ విషయము వేఱుగాఁ దలపోయకు" మని బదులాడెను.

నూరుద్దీను "తండ్రీ! నాపట్ల నీకుఁగల యద్వితీయప్రేమకు జోహారులు. కుమారుఁడు రాజ్యపట్టభద్రుఁడు గావలయునని యేతండ్రియైన నభిలషించుట యనుచితము గాదు. కాని యిప్పట్టున నీవాంఛిత మీడేఱఁ జాలదు. వంచన మొనరించిననే

తప్ప పెద్దాపురపు వీరులఁ జెనకి బ్రదికిబాగుపడుట యసంభవము. మఱియు సంవత్సరముల తరబడి వారి యన్నముఁ దిని లోకమే తమకుటుంబముగా భావించు ప్రభువుల కపచారము తలపెట్టుటకూడ మహాదోషము. తండ్రీ! మోసములేకుండ దండెత్తి మహారణరంగమున వీరి నోడించి రాజ్యముఁ గైకొనుటకు యత్నింతువేని యదొకవిధముగా శ్లాఘ్యమని నేను భావింతునేమోకాని; నాకంఠమునఁ బ్రాణము లున్నంత కాలము నీరాజ్యముపై, నీబాలకులపై నీఁగనైన వ్రాలనీయను. నన్నుఁ బరీక్షింపదలఁచియో, మఱేకారణముననో యిట్లంటివి కాని; నీకైన నిట్టి దుస్సంకల్ప ముదయించియుండునని నేను నమ్మఁజాలను. ఒకవేళ దురదృష్టవశమున నట్టియూహ యంకురించుచో నిజమైన పక్షమున నది మొలకయై యుండ గనే త్రుంచివైచి నీహృదయమును, నీకీర్తిని నిష్కల్మష మొనరించుకొనుము " అని తండ్రితోఁబలుక నాతఁడు కుమారుని నేరుపుతో విషయాంతరములకు మఱలించి, 'ప్రభుభక్తి పరాయణుఁడగు కుమారుఁడు జనించినందుకు గర్వించుచుంటి' నని పలికి, తనకు దుస్సంకల్పములే నట్లాతనికి నమ్మకముఁ గలిగించెను. తనయున కే విధమయిన యనుమానముఁ గలుగ కుండుటకై కొంతకాల మేగడబిడయు లేకుండ సాగిపోనిచ్చెను. ఉపాయాంతరము లతినిగూఢముగా నన్వేషింపఁజొచ్చెను.

---

# 6. వీరద్వయము - వారిహృదయము

రాజనీతి కడుంగఠోరమయినది. కేవలముం బాపపుణ్యములు పరిగణించి వ్యవహరించుట కవకాశము లేనట్లు కానంబడును. వీఁడు మిత్రుఁడు, వీఁడు శత్రువు నను నాలోచనము లేకుండ సమయానుకూలముగా మిత్రశత్రుభావముం జూపవలసి వచ్చు చుండును. ఎన్నిపాట్లువిధముగాం బడినను దుదకు ప్రజారంజకుఁడై పేరుగాంచు టరుదు. కావుననే "రాజ్యాంతే నరకం ధ్రువం" అను నానుడి. ధర్మమార్గమునఁ బోదలఁచు వారి కవరోధము లెక్కువ. ధర్మమందలి సూక్ష్మత నెఱుంగుటయు నందఱికి నలవియగుపని గాదు. ఇట్టి స్థితిగతులలోఁ గేవలము రాజ్యకాంక్ష, యధికారమదోన్మత్తత గలవా రెట్టి యమానుష కృత్యములు చేయుటకైనను వెనుదీయరు.

ఔరంగజేబు రాజకీయపుఁ జాతుర్యముచే ననుఁడు, ఘోర కుతంత్రములచే ననుఁడు సోదరులను, దండ్రిని బొట్టఁ బెట్టుకొని కఠోరముగాఁ గొంతకాలము ఢిల్లీసామ్రాజ్య మేలి కాలగర్భమునఁ గలిసిపోయెను. ఆతని యనంతరము సింహాసనమునకు వచ్చిన వారు దుర్బలులైనందున దక్షిణదేశమునకుఁ బ్రతినిధిగానున్న 'కుమ్రుద్దీన్ అసఫ్‌జా' యనునాతఁడు స్వతంత్రించి 'నైజాము ఉల్ ముల్కు' అను ప్రభునామముం దాల్చి తనక్రిందనున్న రాజమహేంద్రవరము, శ్రీకాకుళము మున్నగు

నిరువదిరెండు పరగణాలు తన యధీనమున నుంచుకొని గోల కొండ రాజ్య పాలకుఁ డయ్యెను. అప్పటినుండియు ఢిల్లీశునకుఁ గాక తనకుఁ గప్పములు చెల్లింపుఁడని యాంధ్రరాజులను గోరు చుండెను. వా రాతని కోరిక లెక్క సేయకుండిరి. ఇంతియే కాక నైజాముపై దండెత్తి రావలసినదనియు, నవసరమగు సాయముఁ గావింతుమనియుఁ జక్రవర్తికి వార్త లంపుచువచ్చిరి. చక్రవర్తియు నదను జూచి నైజామును శిక్షింపఁ దలంచు చుండెను. మఱియు నదేకాలమునఁ బశ్చిమమున మహారాష్ట్ర వీరులు సాహూ, పీష్వా, బాజీరావు మున్నగు ప్రముఖుల నాయకత్వమున బలము సంపాదించి సమయము చిక్కినపుడు గోలకొండరాజ్యముఁ గబళించుయత్నములో నుండిరి. నిజా మును వారి వ్యవహారములలో వీలయినపు డెల్ల జోక్యముఁ గలి గించుకొనుచు వారిలోవారికి విభేదములు గల్పించి వారి రాజ్యము వశపఱచుకొనఁ బన్నాగములు పన్నుచుండెను. ఇట్లు సుమారు పదిసంవత్సరములు గడచినను గప్పముఁ గట్ట నిరాకరించి యెదురుతిరిగిన యాంధ్రరాజులపై స్వయముగా దండెత్తిపోవ నైజాముప్రభువునకు వలనుపడ దయ్యెను. ఆపని కెవరినైనఁ బంపుద మన్నను దగినవీరుఁడు గానఁబడక యూర కుండవలసివచ్చెను.

ఈ స్థితిగతులలో బుద్ధికుశలుఁ డగు రుస్తుంఖానునకు మంచి యాలోచన దట్టినది. అతినిగూఢముగా నైజాముతో నుత్తర ప్రత్యుత్తరములు జరిపి యాతనికిఁ దనపట్ల గట్టి నమ్మక

మేర్పడునట్లు చేసికొనెను. రుస్తుమున కిది మంచి యవకాశ ముగాఁ గానఁబడెను. ఆంధ్రరాజులలో మొదటి నుండియు బలిష్ఠముగానుండి, తాను చక్రవర్తి యాజ్ఞలకు బద్ధుఁడుగా నున్నప్పటినుండియు సర్వస్వాతంత్రముగానుండి, యేవిధముగను లోఁబడకయున్న సంస్థానము పెద్దాపురము. చిన్న చిన్న రాజుల నే విధముగా జయించినను బెద్దాపురము వారిని జయింపలేక, గత్యంతరము కానఁబడమి వారితో సఖ్యము నెఱపవలసి వచ్చుచుండెడిది. ఆ సంస్థానముఁ జూచుకొనియే తక్కిన రాజు లును ధైర్యముతోఁ దన్నుఁ దృణీకరింప సాహసించుచుండిరి.

ఈ స్థితిలో సంస్థానపు గుట్టుమట్టు లన్నియుఁ దెలిసి తనకు సకలవిధముల సాయముచేయఁగల వీరుఁడు రాజనీతిజ్ఞుఁడు నగు నొకఁడు తనదగ్గఱకు వచ్చుట కన్నఁ గావలసిన దేము న్నది? ఆతనికిఁ గావలసిన సాహాయ్య మొసఁగి యాంధ్రులపైఁ బంపినచో వారినిజయించి పేష్కసు వసూలు చేసికొని రాఁగ లఁడు. పెద్దాపురపువారు వానికిఁ దోడుపడు సందర్భము వచ్చిన మంచిదే. అవలీలగా నాసంస్థానమును గూడ మర్మజ్ఞుఁ డగు నాతఁడు వశపఱచుకొని యాంధ్రలోకమున నే యలజడియు లేకుండఁ జేయఁగలఁడు. నిశ్చింతముగా మహారాష్ట్రుల కుట్ర లడఁచి ఢిల్లీశుఁడు దండెత్తివచ్చిన నెదుర్కొని తిరుగఁగొట్ట వచ్చును. ఇన్ని యూహలతో రుస్తుంఖానునకు నైజాము గౌరవాహ్వాన మంపెను. ఖానుఁడును బరిస్థితు లాకళింపుచేసికొని నైజాము సేనల సాయముతో నాంధ్రరాజులను, ముఖ్యముగాఁ

బెద్దాపురమును వశముచేసికొని, తదుపరి స్వాతంత్ర్యమును బ్రకటించి తానే యాంధ్ర సామ్రాజ్యము నేలవచ్చునని దృఢ నిశ్చయుఁడై, పెద్దాపురము కొలువు వీడి నైజాము రాజ్యముఁ జేరుకొనెను. అచటఁ గొలఁది కాల ముండి యన్వరుద్దీను మూలమున నైజాము విశ్వాసమును దన నైపుణ్యముచేఁ జూఱ గొనఁ జాలెను. నైజాము ప్రభువు రుస్తుంఖాను నమితముగా గౌరవించెను.

అనంతరము కొలఁదికాలమునకే నైజాము నలువదివేల సైన్యము సాహాయ్యముగా నొసఁగి యాంధ్ర దేశముమీఁదికిఁ బంపుచు, నప్పటికి రాజమహేంద్రవరము మొదలయిన పరగణాలకు సర్‌లష్కరుగా నున్న యన్వరుద్దీనుఖాను నాధి పత్యముఁ దొలఁగించి రాజమహేంద్రవరము సర్‌లష్కరు పదవి రుస్తుంఖానున కొసంగెను. ఆంధ్రరాజులయొద్దనుండి పదునొకండు సంవత్సరముల కప్పము వసూలుచేయునిమిత్తము సర్‌లష్కరై సైన్యముతో రుస్తుంఖాను వచ్చుచున్నాఁడను వార్త యెల్లరకుఁ దెలిసెను. వచ్చుచు మార్గమున హైందవ ప్రజల మానప్రాణములను లెక్కసేయక యందఱిని బీడించు చున్నాఁ డనియు వార్తలు వ్యాపించెను. మహావీరులు మానధనులు నగు శ్రీ కలిదిండి రామరాజుగారును, నూజ వీటి ప్రభు కుటుంబమునకుఁ జెందిన శ్రీ సుబ్బన్నగారును నీసంగతి విని మిగుల ఖేదము నొందిరి. ఎటులైన నాంధ్రజనులకు ముస్లిము దండయాత్రవలని కష్టనష్టములు రాకుండ నివారింప

వలయునని వా రిరువురును సంకల్పించుకొనిరి. తమదగ్గఱనున్న స్వల్పసైన్యము లరాతిసేనల నెదుర్కొనుటకుఁ జాల వని వా రెఱింగియుండక పోలేదు. ఎచటి కైన వెడలి సైన్య సాహాయ్యము నొంది వచ్చులోపలనే రుస్తుము దేశమధ్యము నకు వచ్చి బలపడిపోవును. స్థిరపడిన యాతని జయించుట మఱియుఁ గష్టము. ఈలోగాఁ గొన్ని వేల మంది యమాయి కుల చిత్రవధ జరిగిపోవును. కావున నాంధ్ర దేశపుఁ బొలి మేరలలోనే ముస్లిముల నెదుర్కొని బుద్ధి చెప్ప వలయునని యా వీరులు సంకల్పించిరి.

వారికి సంపదలకుఁ గొదువలేదు. ఢిల్లీశునకు సామంతు లయి కప్పముఁ గట్టుచున్నపు డెవరికైన నేమి? నామమా త్రపుఁ గప్పము రుస్తుంఖానునకే చెల్లించినఁ బెండ్లాము బిడ్డ లతో సుఖముగా జీవింపఁగలిగి యుందురు. రాజతేజము, స్వాతంత్ర్యదీక్ష వారి నట్టి కుక్షింభరిత్వమునకుఁ బ్రోత్సహింప లేదు. చక్రవర్తి కెవుడో సామంతులై యుండవలసి వచ్చినంత మాత్రమున నెవరికిఁబడిన వారికి లోఁబడ వలయు ననుట వారికిఁ జాల హేయముగఁ దోఁచెను. కలియో, గంజియో త్రావి జీవించినను స్వాతంత్ర్యమునకు మించిన మహైశ్వర్యము లేదని రామరాజుగారి యభిప్రాయము. ఎన్ని కష్టనష్టములు వాటిల్లినను నీశరీరము పరోపకారమునకే వినియోగపడవలయు నని యా వీరుల యుదారాశయము. ఇట్టి పరిశుద్ధ మానసము లతో నీ వీరద్వయము దమకున్న కొలఁదిసేనలతో నెదు రేఁగి

మార్గమధ్యమునసే రుస్తుంఖాను నెదుర్కొనెను. ఉభయబల ములును దారసిల్లిన తరువాతఁ దమ రెండుమూడువేల సేన లతోఁ దామెదుర్కొన్న సైనికుల సంఖ్య నలువదివే లని వారు గ్రహించిరి. అయినను ధైర్యోత్సాహములు వీడక యించు మించుగాఁ దమసైన్యము సర్వము నశించినను శత్రుసేనను బది వేలవఱకు రణరంగమునకు బలియొసంగిరి. తమ నాయకుల యానతిఁ దలఁదాలిచి, తుదివఱకు బోరాడి దేశక్షేమమునకై రణరంగమున నసువులు ద్యజించిన యా రెండు మూఁడువేల మంది జోదులు నెంతటి దేశభక్తి ప్రపూర్ణులో ! !

చివరకుఁ దా మిరువురే మిగిలియున్న సంగతి మన వీర ద్వయము గుఱుతించెను. స్వార్థపరత్వముతోఁ దాముగూడ వీర స్వర్గము నొందిన; రుస్తుంఖానుఁ డప్రతిరోధముగఁ దెలుగుసీమల లోఁగొను ననియుఁ, బదివేల సైన్య మెచటనైన లభించినచో వైరిని ససైన్యముగ సంపూర్ణనాశన మొనరించి యాంధ్రప్రజ లకుఁ గడగండ్లు తప్పింపవచ్చుననియు రామరాజుగారును, సుబ్బ రాజుగారును, నాలోచనముఁ జేసిరి. ఇరువురు నొక నిర్ణయము మనసునఁ బదిలపఱచుకొని యర్ధరాత్రమున హుటాహుటి పయనములఁ దమ యాజానేయములతో రాజమహేంద్ర వరము నొద్ద గౌతమిని దరించి పెద్దాపురమువారియొద్దఁ జేరిరి. తమకు సైన్యసాహాయ్యము లొసఁగినచో శాత్రవు లను మట్టుపెట్టఁగల మని విన్నవించిరి. సంస్థానము వారును "సమయము వచ్చినప్పు డట్లే చేయవచ్చును ; కొంతకాలము

విశ్రమించి యలసటఁ దీర్చికొండని వారి కుచితావాసము లొసంగి మిక్కిలి గౌరవించిరి.

---

## 7. ఆరోగ్యాశ్రమ ప్రశస్తి

కాలగర్భములోని విశేషము లనంతములు. ఒకనాఁడు భిక్షుకుఁడైనవాఁడు లక్షల కధికారిగాఁ బరిణమించి మహాహర్మ్యములు నిర్మించు దినము రాఁగలదు. రమ్యసౌధాంతరముల వసించు పుట్టుభోగి కాల వ్యత్యయమువలన మహాదరిద్రుఁడై క్షుత్పిపాసలకు లోనయి నడివీథులఁ దిరుగుచు నలమటింపవచ్చును. విద్యాగంధశూన్యుఁడయ్యు లక్ష లార్జించి యశముఁ గాంచవచ్చును. మహావిద్వాంసుఁడయ్యు నాదరించువారు లేక తాఁ జదివిన చదువులైన మననము చేసికొనలేక మాటుమూలఁబడి యుండవచ్చును. ఒకపుడు మహోద్యానములతోను రమణీయ హర్మ్య పంక్తులతోను విరాజిలు మహానగర మింకొకనాఁటికి శ్మశానవాటికయై శివారుతముల కాలవాలము గావవచ్చును. ఒకపుడు మరుస్థలమై, భయంకర తరుగుల్మ క్రూరజంతువుల కాకరమై, జనసంచార శూన్యమైన ప్రదేశము చక్కని నీటికాలువలతోను, బహువిధ సస్యముల తోడను, పల్లవ పుష్ప ఫల భరితములగు వృక్షములతోను విల

సిల్లు జనపదముగా మాఱవచ్చును. ఇదియంతయు సర్వే శ్వరసంపన్నుఁడగు భగవానుని మాయావిలసితము.

రాజమహేంద్రవరమునకు ధవళేశ్వరమునకును నడిమి భాగము చెట్లు, పుట్టలు, గుట్టలు నధికముగాఁగలిగి చిన్న యడవివలె నగమ్యమై యుండును. మార్గస్థులు నడచుటకేర్పాటు చేయఁబడిన యొక్క బాటతక్క మిగిలిన ప్రదేశమంతయు నెగుడు దిగుడుగా ముండ్లతుప్పలతో నిండియుండి చిఱుత పులులు మున్నగు క్రూరజంతువులకుఁ గూడఁ దావలమై యుం డును. ఉన్నట్లేయుండి ప్రయాణికులుపోవు బాట నానుకొని యొక యాశ్రమము స్థాపింపఁబడి దినదినప్రవర్ధమానమయ్యెను.

ఆయాశ్రమము నెలకొల్పినది మహాతపోనిరతుఁడగు నొక మునీశ్వరుఁడుగాదు. ముప్పది ముప్పదియైదు సంవత్సర ముల యువకుఁడు. ఆయన ప్రజలెవ్వరికిని వేదాంతము బోధిం పఁడు. కేవల మలౌకికుఁడును, దేహబలశూన్యుఁడును గాఁడు. చక్కని శరీరబలము, ముఖమునఁ బ్రసన్న గంభీరమయిన క్షాత్ర తేజము, నఖండరాజనీతిప్రజ్ఞనుసూచించు మనోజ్ఞన యనములుఁ గలిగి కృత్రిమములైన యాడంబరములెవ్వియు లేని యొక వీరక్షత్రియుఁడు. ఆయన యనేక యుద్ధరంగములఁ బని చేసి సాటిలేనిధైర్యముఁ బ్రదర్శించినవాఁడు. యుద్ధమున హత క్షతులైనవారి గాత్రములుచూచి హృదయము ద్రవించిన కరుణామూర్తి. పీడిత మానవసేవయే మాధవసేవ యను నూహ మానసమునఁగలిగి యది వాగ్రూపమునఁ గాక క్రియా

రూపమునఁ జూపదలఁచెను. అభిమానవిద్యగాఁ దాను నేర్చిన వైద్యశాస్త్రము మానవసేవకుఁ బ్రధానసాధన మని యాతఁడు గుఱుతించెను. పెక్కు ప్రభుత్వోద్యోగములు, ధనార్జనమున కనువగు లెక్కలేని యుపాయములుఁ దమంతఁదామువరించి వచ్చినను సరకుసేయక, రాజమహేంద్రవరమునకు ధవళేశ్వరమునకు నడిమిప్రదేశమున సువిశాలమయిన యొక తోఁట బాగుచేయించి యందొక్క శుభముహూర్తమున నారోగ్యాశ్రమము నిర్మించెను.

పేదసాదలయెడ నెట్టి భేదభావమును లేక యాశ్రమమున కార్తులై యేతెంచిన యశేషప్రజలకును జల్లని యమృతమువంటి పలుకులతో శరీరారోగ్యమేకాక మానసిక శాంతి గూడఁ గలిగించుచు నాతఁడు ప్రజాసేవ చేయుచుండెను. వైద్యరాజు, రాజయోగి, దాసు, ఆశ్రమాధిపతి యని యాయన పేరు దేశమంతట వ్యాపించిపోయెను. పై ప్రసిద్ధ నామములముందాయన యసలుపేరేమో యెవ్వరికిఁ దెలిసికొన నవసరము లేకపోయెను. దేశములోని వివిధభాగములనుండి రోగపీడితులచటి కరుగుదెంచి కొలఁదికాల మాయాశ్రమమున వసించి సకలరుజలుఁ బాసి సంతుష్టులై వెడలి పోవుచుండిరి. దాసుగారును దమకు నగరమున నివసించుటకుఁ దగు సకలసౌకర్యములున్నను బురబహిఃప్రదేశమందలి తోఁటయే యారోగ్యసూత్రముల కనుగుణముగా నుండునని తలంచిరి. మఱియు ననేకవిధరాగద్వేషములకు నిలయమైన నగరముకన్నఁ బ్రకృతి

సౌందర్య విలోకనమునకు, నిర్మలశాంతికి మనో వికసనమునకు నాతోఁటలోని యొక చిన్న కొండయే సముచిత స్థలమనిభావించి యచటనే స్థిరనివాస మేర్పఱచుకొనిరి.

ఒకనాఁడు వైద్యరాజుగారు కాలకృత్యములు దీర్చు కొని యతిథులుండు ముందఱివాకిలిలోనికి వచ్చుసరి కచట నేఁబదిమంది జనులు నిలిచియుండిరి. వారిం జూచినఁ నందఱు దౌర్జన్యముగా నాశ్రమము నాక్రమింప వచ్చిరా?' యని యనుమానపడక తప్పదు. వా రాశ్రమాధిపతిపట్ల సమాను షమే తలపెట్టియుండిరా? ఆయనదర్శనము కాఁగానే యంద ఱొక్కుమ్మడిఁ బాదములపైఁ బడి సాష్టాంగ మొనరించిరి. వచ్చినవారిలో నాయకుఁడు "స్వామీ! కరుణించి రక్షింపుఁ" డని భయకంపిత కంఠముతోఁ బలికెను.

సహజ కృపామధురమైన వాక్కులతో నాయన వారిని లేవఁబంచి "మీకిపుడు గలిగిన హానియేమి? నాశరీరమునఁ బ్రాణము లున్నంతవఱకు శక్తికొలఁది యత్నించి మీకు సేవ చేయఁగల" నని వచించిరి. దాసుగారి వాక్యములు విన్న యనంతరము నాయకునకు నోట మాటరాలేదు. తుదకు మనసు కుదురుపఱచుకొని "ప్రభూ! మన్నింపుఁడు. మాకుఱ్ఱవాఁ డొకఁ డవివేకముచే నజాగరూకుఁడై గుఱ్ఱపుస్వారిఁజేయుచు, నాలుగుదినములక్రిందట నీమార్గమున ధవళేశ్వరము పోవుచుం చుండెను. అపుడు ముందర బండిలో నేగుచున్న స్త్రీలను, బాలురను గమనింపక, దగ్గరగాఁ బోయిన పిమ్మటనైన గుఱ్ఱము

నాపి దిగక, కొంచెము గర్వమున బండిని దప్పించుకొనిపోవు యత్నమున గుఱ్ఱము నదలించెను. అది బెదరి బండిపైఁ బడుటతోడనే బండి బోరగిలఁబడెను. అందలివారికి గాయములు తగిలినవి. విచారించినమీఁదట నది తమబండియని తెలియవచ్చినది. తమపట్ల నీవిధముగ జరిగిన యపచారమునకు క్షమింపవేడునిమిత్తము మే మిచటికి వచ్చితిమి" అని విన్నవించెను.

"ఇంతమాత్రమునకు మీరందఱుఁ బనులుమానుకొని యిచటికి రానేల? అది యానాఁడే మఱచితిని. ఎవ్వరైనను బుద్ధిపూర్వకముగాఁ బసివాండ్రను హింసింపఁ బూనుకొందురని నేననుకొనను. అశ్వశిక్షణము సరిగాఁ దెలియనపుడు మఱికొంత జాగరూకత గలిగియుండుట మంచిదే యనుకొనుఁడు. ఏ సామాన్యగృహస్థుని బిడ్డలకైన నీయపాయము గలిగిన; మీరందఱు వెడలి యాగృహస్థుని నిటు లనునయింతురా? నా బిడ్డలకు వెంటనే నేను చికిత్స చేసికొనఁగలిగితిని. పేదలగువారట్లు వెంటనే చేయించుకొనఁ గలుగుదురా? బుద్ధిపూర్వకముగాఁగాక పొరపాటుననే యీసంఘటనము జరిగిననాఁడు క్షమింపఁదగిన యంశ మిందేమి కలదు?" అని హితముగఁబలికి వారందఱికిఁ బండ్లు, పాలు మున్నగునవి యొసఁగి యాదరించి దాసుగారు పంపివైచిరి.

అందఱును నాయనకు నమస్కరించి, సెలవుపుచ్చుకొని వెడలిపోయిరి. నగరమునందు వివిధప్రముఖులతోఁ గలిగిన పరిచయముఁ బురస్కరించుకొని వైద్యరాజుగారు దమ గుఱ్ఱపు

లాతు నెట్టివిధముననైన శిక్షింపఁగల రని వారు భయపడిరి. కాని యాశాంతమూర్తి గంభీరభాషణములకు వారందఱును సమ్మోహితు లయిపోయిరి. నాఁటినుండి మఱెన్నఁడు నా యువకుఁ డిం కెవ్వరియెడ, నెట్టి ధూర్తవర్తనముఁ జూపలేదు. ఆశ్రమాధిపతి పలుకు లాతని మనోదోషమునకుఁ జక్కని చికిత్స యొనరించినవి. ఆరోగ్యాశ్రమపుఁ గీర్తి యనేక విచిత్ర కథలతో దేశము నాలుగుదెసలు వ్యాపించెను.

---

# 8. ఖాసుని నిశ్చయము

దుర్మార్గులందును నోరిమి చూపుట తాపసుల లక్షణము. వారు నపుడపుడు తాత్కాలికోద్రేకమునకు గుఱియై, ఘోరతపోవ్యయ మొనరించుకొని శాపము లొసంగుచువచ్చిన యుదాహరణము లనంతములు. పరాభవము నెదురుకొనవలసి నపుడు మృగేంద్రము నెదిరించి పాఱఁగొట్టిన మేఁకపోఁతు కథయు మన మెఱుంగనిది కాదు. అట్టియెడ క్షుద్రమృగముల గుంపు తనమీఁదికివచ్చి యవమానింపఁ గడంగినపుడు తోఁక త్రొక్కిన త్రాఁచువలె బుసకొట్టి, యెదిరించి, పగగొని, శత్రు మారణ మొనరింపకుండ రాజసింహ మెటులు నిదురపోఁగలదు ?

మహావీర వరేణ్యులగు కలిదిండి రామరాజుగారు, నూజవీటి సుబ్బన్నగారు శత్రువుల బాహుబలమునకుఁ గాని

పరాక్రమునకుఁ గాని వెనుదీసి ప్రాణభీతితోఁ బెద్దాపురమునకు రాలేదు. రాజ్ఞి రాగమ్మగారు వెంటనే కొన్ని సేనలు దోడిచ్చి పంపిన; రుస్తుము నెచటికచటనే డీకొని రూపుమాపవలయు నని వారితలఁపు. వారిది పచ్చి యుడుకురక్తము. సోమయాజులుగారి రాజనీతిచాతురి వారి మది కెక్కలేదు. వారిది ధీరోద్ధతప్రకృతి. "తమపక్షమున ధర్మబలము కలదు. ఎదిరిబలములో సగము బలము తమకున్నను శాత్రవుల నవలీల నుగ్గు చేయఁగలరు. తలవనితలఁపుగా నలువది యేఁబదివేల సేనలతో ఖానుఁడు దండయాత్రకు దొరకొనినాఁడు. ఆతని నేమాత్ర ముపేక్షించి వదలినను నాంధ్రప్రజానీకమునకుఁ గలుగు కడగండ్లపారములు. తాము రాజులై వీరులై పుట్టిన దెందులకు? ప్రజలకు రాఁబోవు నాపద నివారింపలేని రాజు రా జనిపించుకొనుట కర్హుఁడా?" ఇవియే వారియూహాలు.

రాగమ్మగారు తొందరపడి యేపనియుఁ జేయుట కవివేకవతి గాదు. "రుస్తుముఖా నేదృష్టితో బయలుదేఱుచున్నాఁడు? నైజామునకు రావలసిన కప్పములు వసూలుచేయుటకే యేల కాఁగూడదు? అటులయినపుడు తాను నైజామునకు సామంతరాజ్ఞి కాదే! ఏఁబదివేల సైన్యముతో వచ్చుచున్న యాతనితో విరోధ మేల కొనితెచ్చుకొనవలయును? మఱియుఁ గొంతకాల మాతఁడు తనసేవలో నున్నవాఁడే కదా! తాఁ జేసిన యుపకారములన్నియు మఱచి తనకుఁగాని, రాజ్యమునకుఁగాని ద్రోహము తలపెట్ట సాహసించునా? అట్టిది సంభ

వించిననాఁడు ఖానుఁడు తన యేకైకసుతునితోఁ గూడఁ బోర వలసి యుండునని యెఱుఁగఁడా? నూరుద్దీను సంస్థానముపయిఁ గుట్ర పన్ని తండ్రితో గలియు ననుట శ్రీరాముఁ డేకపత్నీ వ్రతము విడుచుట, సత్యహరిశ్చంద్రుఁడు సతతముఁ గల్లలాడుట యెంత యసంభవములో యట్టిదే. యువకద్వయము నుద్రేకముంజూచి, వెంటనే సేన లొసఁగి, వారిఁ బ్రోత్సహించి పెక్కు వత్సరములనుండి మహ్మదీయులు తన మామగారి నాశ్రయించి చేసికొన్న సంధి భంగపుచ్చుట యుచితమా?"

ఈవిధముగా నుత్పన్నములగు పెక్కుసమస్యలను నిలకడ మీఁద నిదానించి పరిష్కరించుకొనవలయును. ఆమె వానిని సాకల్యముగా, సావధానముగా విచారింపఁగల చతురురాలు. పైగా నామె కుమారులు తిమ్మజగపతియు, బలభద్ర జగపతియుఁ గడువివేకవంతులు, ధీరోదాత్తులు. ఆమె నేవిధముగను దొందరపఱుపక, తాము సర్వసమర్థు లయ్యు విశేష పరిపాలనానుభవము గల తల్లి యాజ్ఞలకు సర్వదా బద్ధులై యుండువారు. మఱియు మహా తపస్వియు, నపార లౌకిక మేధాసంపద గలవాఁడును నగు కొంపెల్ల సుబ్రహ్మణ్య సోమయాజులుగారు సారథియై యుండ వా రెటు లుద్వేగ మార్గమునఁ జరింతురు?

సమయము వచ్చినపుడు శౌర్యధైర్యములకు దోహదమొసఁగు తలఁపునఁ గలిదిండివారికిని, నూజవీటివారికిని సకల సదుపాయములుఁ గావించి, వారిని రాజగౌరవములతోఁ

జూచుచుండిరి. కాని యావీరశిఖామణు లెంతో కాల మిటులు నిలువఁజాలరైరి. "ఇచట విశ్రమించి విందులు గుడుచుచుఁ గూరుచుండిన రుస్తుంఖాను బలపడి విజృంభించి, సర్వస్వతంత్ర సంస్థానమై, కవిపండిత పోషకమై, సుభిక్షమై విలసిల్లు పెద్దాపురమునకుఁగూడ ముప్పు గల్గింపకమానఁడు. కావున నాతఁడు రాజమహేంద్రవరముఁ జేరి యెంతమాత్రము స్థిరపడకుండ నిరోధింపవలయును. తమయందభిమానమున్న కొందఱిని జేర్చుకొని మరల ఖాను నెదుర్కొని, గెలుపుమాట యెటులున్నను వాని బలము నింకొకింతయైన శిథిలపఱుప వలయును" అను నూహతో వారు జగపతుల యనుమతి వడసి వెడలిపోవ నుద్యుక్తులయిరి. వారిని దగురీతి సన్మానించి, యార్థిక సాహాయ్యమొనరించి రాజ్ఞి రాగమ్మగారు పంపివైచిరి. కాని ప్రత్యక్షముగ సైనిక సాహాయ్యమిచ్చి, ఖానునిమీఁది కంపి ముం దాతనిఁ గవ్వించుటకు వారిష్టపడలేదు.

మహాశూరాగ్రేసరులు రామరాజు సుబ్బన్నగారల ప్రతిఘటనముతో ఖానుని సైన్యములో నించుమించు పదివేల సైన్యము నశించినది. అయినప్పటికి నాతఁడు పట్టినపట్టు విడువక, రాజమహేంద్రవరముఁ జేరుకొని, కోటలోఁ బ్రవేశించి కట్టుదిట్టము లొనరించుకొనెను. వీరవరులు పెద్దాపురముదారి కేఁగుటతోడనే యిఁక నెదిరించువారు లేక యనతికాలముననే యాతఁడు రాజమహేంద్రవరముఁ జేరఁగలిగెను. వచ్చిన కొలఁదికాలముననే ఖానున కారోగ్యాశ్రమవృత్తాంతము తెలిసెను.

ఆశ్రమమున కేవిధమయిన రాజకార్యసంబంధము లే దను నమ్మకము ఖానునకుఁ దోఁపకుండెను. అది తనకృషి కంతరా యముగా నాంధ్రరాజులు కల్పించినకుట్ర యని యాతని యాశ యము. తాను కార్యనిమగ్నుఁడై యున్నపు డీయాశ్రమమునఁ బ్రచ్ఛన్నముగా నున్న వీరసమూహము తనపైఁ బ్రాణాంత కముగా దెబ్బ తీయునేమో యని యాతని సంశయము. తన సైనికుల నంపి, యాశ్రమమును ముట్టడింపఁజేసి, దానిని ఛిన్నభి న్నము చేయవలయునని యాతఁడు తలఁచెను. కాని, వెంటనే మరల నాతఁ డి ట్లాలోచించెను. "మనము ముందు నిర్వర్తింప వలసిన కార్యభార మనంతము. దారినడుమనే పది పంద్రెండు వేల సేనలు నశించినవి. ఇపు డీయాశ్రమ మన్నను, దాని యధి పతి యన్నను నీ చుట్టుపట్టులనుండు ప్రజలకుఁగల గౌరవ మపరి మితము. ఇట్టిస్థితిలో నాశ్రమముపై వ్యగ్రచర్యకుదిగిన నశేష ప్రజలవిరోధమునకుఁ బాలుపడవలసివచ్చును. కలహము ముదిరి కయ్యమే చేయవలసివచ్చుచో, మరలఁ గొంత సైన్యనష్టమగును. కావున దీని కేదైనఁ నుపాయ మాలోచించుటే మంచిది. ఇట్లు తలపోసి యాతఁడేదో మనసున నిశ్చయించుకొనెను.

---

# 9. రాయబారము

ఒక్కొక్కపుడు బుద్ధిమంతు లెవ్వరు నూహింపఁజాలని విచిత్ర సంఘటనములు జరుగుచుండును. ధవళేశ్వరమునకు

రాజమహేంద్రవరమునకుఁ జుట్టుపట్టులఁగల గ్రామము లన్నిటి యందు నెంతో సంచలనము బయలుదేఱెను. ఏ సందునఁ జూచిన నీవార్త చెప్పుకొని, ముక్కుపై వ్రేలిడుకొని విచారము నొందువారే. గట్టిగా నొకరితోనొకరు చెప్పుకొనుటకు భయము. కాని యథార్థవార్త దెలిసికొనకుండ నెవ్వరు నుండఁ జాలకున్నారు. కొందఱు యువకులుఁ, బౌరుషవంతులు "నింత దుర్మార్గమున కొడిగట్టినవారినిఁ జీల్చి చెండాడవలయు" నని మీసములు దువ్వుచుండిరి. కాని జరిగినసంగతి పూర్ణముగా నెవ్వరికిఁ దెలియదు.

"ఆరోగ్యాశ్రమాధిపతి యింట నొక శుభకార్యము నిశ్చితమై కొలఁదినాళ్ళలో జరుగనుండెను. ఆ మహోత్సవమునకుఁ గావలసిన సంభారములు, ధనము సేకరించుకొని యింటియం దుంచుకొనిరి. ఒకనాఁటి రాత్రి సాయుధులైన యేఁబదిమంది దొంగ లొంటరిగానున్న వారియింటిపైఁబడి దోఁచుకొనిరి.

"రుస్తుంఖాను సైనికులు దోఁచుకొనుట కలవాటుపడి యీపనిచేసిరి. వారికి వివేకము బొత్తిగా లేదు. కఠినులగు వారు తప్ప నీయాశ్రమముమీఁదికి మఱెవ్వరు రాఁగలరు?"

"ఆశ్రమము రాచఱికపుబెత్తులకు రంగమేమో యని ఖానుఁడే యీపనిఁ జేయించినాఁడు. ఇచటివారి కీయాశ్రమపు సంగతి తెలియకయుండుట యసంభవము."

"ఇది తుఱకలుగావించిన ఘోరమయినఁ గొంతయర్థము నుఱదును. ఈ దోఁపిడిలోఁ జేరినవారు హిందువులే యఁట.

వా రితరప్రాంతముల దొంగలై యుండవలయును. కాకున్న నీ యాశ్రమముజోలికి కిచటిదొంగలైనఁ బోవ సాహసింపరు.”

పౌరులందఱి యూహలుఁ బైరీతి బహువిధములుగా నుండెను. తుదకుఁ బెద్దలు దాసుగారికడ కేఁగి, యథార్థమును గూర్చి ప్రశ్నించిరి. అవసరమగుచోఁ జుట్టుపట్టులనున్న గ్రామము లందలి జనులందఱు సర్వశక్తులు ధారవోసి, ప్రతిక్రియ గావింప సిద్ధమైయున్నా రని విన్నవించిరి. ఆయన యేకల్మషములేని చిఱునగవుతో “పాపము! అమాయికులు, వట్టి వదంతులను నమ్మి యనవసర భ్రాంతి నొంది బాధపడుచున్నారు.” అని సమాధాన మిచ్చిరి. అదివిని వారందఱు నిజముగా విభ్రాంతు లైరి. ఆయన యసత్యమాడుచుండిరా? అట్లూహించుటకైన నెడమున్నదా? అసత్యమే కానిచో సహస్రముఖముల వ్యాపించిన యావార్త లేయాధారమును లేకుండ నెట్లు పుట్టెను? వచ్చినవారందఱు నుచితమర్యాదలంది, సంశయడోలాందోళిత హృదయములతోడనే వెడలిపోయిరి.

ఒకనాఁటి ప్రాతఃకాలమున దాసుగారు తమనిత్యకృత్యములు ముగించుకొని, లోనిమందిరమున నేదో గ్రంథముఁ బఠించుచుండిరి. అపుడు సేవకుఁ డొకఁడు వచ్చి “మీకొఱ కెవ్వరో ముప్పురు మహానుభావులు ద్వారము నొద్ద వేచియున్నా” రని విన్నవించెను. వారి కుచిత గౌరవము లొసఁగింప నియమించి, నియమప్రకారము తమ పఠనము ముగించుకొని దాసుగా రతిథిమందిరములోనికి వచ్చిరి. అచట నున్న వారిం

జూచునరి కాయన కెన్నఁడులేని యీానద్విభ్రాంతి కలిగినది. విశ్వామిత్రునితోఁ గూడిన రామలక్ష్మణులవలెను, వాల్మీకి మహర్షులతోడి కుశలవులవలెను వారాయనకు గోచరించిరి.

ఉచిత మర్యాద లయిన తరువాత దాసుగారు "తా మెవ్వరో యెఱుంగఁ గోరుచున్నాను. వచ్చినపనిఁ దెలిపిన యథాశక్తి సాయడఁగల" నను సూచనతో వారివైపునకుఁ జూచిరి. ఆచూపున కర్థము వారిలోఁ బెద్దవాఁడును, ధీశాలియునగు సోమయాజులుగారు గ్రహించిరి. అయ్యా! నేను పెద్దాపుర సంస్థానమువారి పురోహితుఁడను. వీ రిరువురు మహారాజ్ఞికిఁ బుత్రసమానులగు రాజోద్యోగులు. తమ కీర్తి చాలకాలము నుండి మేము వినియుంటిమి. దర్శనముచేయఁ గాక్షించుచుంటిమి. ఈమధ్య దుండగీం డ్రెవ్వరో మహానుభావులగు తమకును నపచారముఁ దలపెట్టిరని వినియుంటిమి. మారాణి రాఘవమ్మదేవిగారు తమదర్శనముఁ జేసి యొక చిన్న కోరిక గోరుటకై మమ్మంపిరి." అని తామువచ్చిన పని సోమయాజులుగారు బహువృదులముగా సూచించిరి.

అపుడు దాసుగారు సహజమధురములైన వచనములతో "మహాత్మా! లౌకికము, నలౌకికము నగు తమప్రజ్ఞావిశేషము నిదివఱకు వినియుంటిని. ఇపుడు ప్రత్యక్షముగా మిమ్ముఁ జూడఁగలుగుట ధన్యుఁడనయితిని. మీామహారాజ్ఞికి నాయందు గలిగిన యవ్యాజకరుణకుఁ గృతజ్ఞుఁడను. నాకు

దుండగీంద్రవలన హానికలిగినదని యిచటివారు చాలమంది పడినభ్రమ మీావంటి పెద్దలపఱకు వ్యాపించుట నాకుఁ గొంచె మాశ్చర్యముగా నున్నది. మఱియు మహోఘనత వహించిన సంస్థానపాలకులకు నావంటి సామాన్య ప్రజానీకునితో నెట్టి యక్కఱ గలిగియుండునో నేనూహింపఁజాలకున్నాను. ప్రజా రంజకులు, ధర్మబుద్ధులునగు పెద్దాపుర ప్రభువరుల కెవుడును విధేయుఁడను" అని పలికిరి.

సోమయాజులుగారు మరల నందుకొని "సౌజన్యనిధీ! మీావంటివారి యభిమానముఁ, బ్రోత్సాహము నుండుటవల ననే సంస్థానపాలకులు ప్రజానురాగమునకుఁ బాత్రులు గాఁగలి గిరి. ప్రస్తుత మాంధ్రదేశమునకు రాఁబోవు నుపద్రవములను మీారూహింపఁగలరు. మీా రేకారణమునఁ గాదన్నను రాజ మందిరముఁ జేరియున్నరుస్తుమే మీాకుఁ గీడు గలిగింప దుష్టుల బ్రేరేచెనన్న సంగతి నిజమగు నవకాశము లేకపోలేదు. ఇంత వఱకు ధర్మమును, స్వాతంత్ర్యమును నిలుపుకొనివచ్చుచున్న ప్రసిద్ధాంధ్ర సంస్థానము పెద్దాపురమొక్కటే. దానిపైఁగూడ ఖానునికన్ను పడకపోలేదు. తాము పెద్దాపురము దయచేసి, మంత్రిత్వము వహించి సంస్థానమునకు, నశేష ప్రజానీకమునకు మేలుకూర్పవలయునని మహారాణిగారి యభిమతము. రాజ కుమారులీవిషయమున స్వయముగావచ్చి మిమ్ముఁ గోరఁదలఁ చిరి. కాని కారణాంతరములవలనఁ దమ పక్షమున మమ్మంపిరి." అని సంగతి స్పష్టపఱచిరి.

అప్పుడు దాసుగారు వారితో వినయపూర్వకముగా నిటులు పలికిరి. "మహాత్మా! తమవంటి ప్రజ్ఞానిధులముందు నను బోలు సామాన్యుఁడు సూర్యునియెదుటి దివిటీవంటివాఁడు ధర్మతత్పరులగు ప్రభువుల యనుశాసనము నాకు దాఁటరానిది. కాని యేలకో ప్రస్తుతము నాకీక నెట్టిరాచటికపు వ్యాసంగమునందును మనసు చొచ్చుటలేదు. మఱియు నిచట నేదో యీ చిన్న వ్యాసంగము కల్పింపఁబడిన పిదప నీచుట్టు పట్టుల సేద్యపుఁబనులలోనేమి, యాశ్రమమునకు వస్తువులందఁ జేయుటలోనేమి యనేకులు వృత్తి యేర్పఱచుకొని నన్నుఁ గనిపెట్టుకొని యుండిరి. పెక్కురోగులు దిక్కులేనిస్థితిలో నున్నారు. నే నీస్థాన మిపుడు విడిచి వచ్చివేయుటతో వీరందఱు నిరాధారులై బాధనొందఁగలరు. రాజ్యాంగ కృత్యములలో జరుగు తంత్రములు మున్నగునవి మనసును ప్రశాంతముగాను, ధర్మబద్ధముగాను నుండనీయ వని నాకుఁగల కొలఁది యనుభవమువలనఁ గొంతవఱకుఁ దెలిసికొనియుంటిని. రాజ్ఞీమణికిని సుతులకును నాకృతజ్ఞతా వందనములు నాకు మాఱుగా నర్పించి నన్ను క్షమించునట్లు చేయింపఁగోరుచున్నాను"

దాసుగారి యామాటలు విని సోమయాజులుగారును, వారితోడి యిరువురు నెన్నో విధముల నచ్చఁజెప్ప యత్నించిరి. కాని తుదకు దాసుగారే జయింపఁగలిగిరి. ఇతరు లెవ్వరు నెఱుంగకున్నను నాయనమాత్రము వచ్చిన యిరువురు యువకోద్యోగులెవ్వరో గ్రహించి యుండిరనియే నమ్మవచ్చును.

ముప్పురకును దాసుగారు తగురీతి సత్కారముఁ గావించిరి. వారు నానందించిరి. దోపిఁడి వృత్తాంతమంతయు వట్టి వదంతి మాత్రమని వారికిని నమ్మకము గలుగకున్నను విశేషముగాఁ బ్రశ్నించు టుచితము గాదని యూరకుండిరి. ఆగంతుకులు ముప్పురు గొంతసేపు ముచ్చటించి సెలవుపుచ్చుకొని తా మధి రోహించివచ్చిన యుత్తమాశ్వములపైఁ బయనమై పోయిరి.

వాయువేగముతో నాముప్పురు వీరులును బయనించు చుండిరి. కొంతదూర మేగినతరువాత తమవెంట నెవ్వఁడో యాశ్వికుఁ డొకఁడు జవమునఁ దమ్ము సమీపింప వచ్చుచుండె నని వారు కనుఁగొనిరి. అందుకు వా రెంతమాత్రము జంక నవ సరము లేదు. తారసిల్లినపుడు యుద్ధము చేయవలసి వచ్చుచోఁ దమవృత్తాంత మనవసరముగా వెల్లడియగునని వారు తమ వేగము హెచ్చించిరి. వెనుకటివీరుఁడును దానిని మించిన వేగముతో గుఱ్ఱమును నడిపి, వారినిఁదాఁటి యడ్డముగా దానిని మరలించెను. వారిలోఁ జిన్నవాఁ డొఱనుండి కరవాల మూడఁ బెఱికి యాక్రొత్తవీరు నొక్కయుదుటున నఱుక సిద్ధముకాఁగా నాతఁడు వెంటనే గుఱ్ఱమునుండి దిగి సాష్టాంగపడెను. వా రాశ్చర్యముతోఁ జూచుచుండ నాతఁ డిట్లు పలికెను.

"అయ్యా! నేను మిమ్ము శరణుగోరి వచ్చినవాఁడను గాని; మీకు హానిఁ దలఁచినవాఁడఁ గాను. ఒక యరగడియ నా మనవి యాలకించి, నన్ను క్షమించి మఱియు నేఁగుఁ" డని వేఁడుకొనెను. ఆతఁ డించుమించు నలువదిసంవత్సరముల వయసు

గలిగి దృఢదేహుఁడై యుండెను. మొరటుదేఱిన చూపులు, మెలికలు దిరిగిన మీసములు, నెత్తుగనున్న నుదురుఁ జూచు వారికిఁ గొంచెము వెఱపు గలిగింపక మానవు. కాలాతిక్రమ మగుచున్నదను భయ మున్నను క్రొత్తయైన విశేషములు దెలియు నని వా రాతనిమాటలు వినఁ గుతూహలముఁ జూపిరి. అప్పుడాతఁడు తనసంగతి యిట్లు విన్నవించెను.

మహానుభావులారా! ధవళేశ్వరమునకును, భీమవరమునకును నడుమనున్న యొక చిన్నపల్లె మా నివాసగ్రామము. ఆలుబిడ్డలు మొదలగు బంధములు నాకు లేవు. బాల్యము నుండియుఁ బెద్దల కట్టుబాటు లేక స్వేచ్ఛతోఁ దిరుగుచుంటిని. వీలయినపుడు కూలినాలిచేసికొని, భోజనములేనపుడు దారులు గొట్టియు జీవించువాఁడను. బలిష్ఠుఁడను, గొంచెము చదువు గలవాఁడ నగుటఁ గొంద ఱనుచరులు నన్నాశ్రయించిరి. చుట్టుపట్టుల గ్రామములలో నాపే రన్న నందఱకు భయము. అయినను నే నెన్నఁడు హత్యలు చేయలేదు. తిండి లేనపుడే కాని దారులు గొట్టలేదు. రాజమహేంద్రవరమునకుఁ గ్రొత్త యధికారి వచ్చియున్నాఁడని తెలిసి, యేదైన వృత్తినాసించి కొలఁది మంది యనుచరులతో నిచటికిఁ జేరితిని.

నా సంగతిఁ గనిపెట్టి, నా నాయకత్వమున నలువదిమంది ముస్లిముసైనికుల నిచ్చి, యారోగ్యాశ్రమముఁ గొల్లగొట్టి రమ్మని యాయధికారి నన్నంపెను. 'ఇది సరిగా నెఱవేర్చినఁ; జిన్న సైనికోద్యోగ మిత్తు' నని నా కాసచూపెను. పదిమంది

నాయనుచరులతోను, హైందవవేషముఁదాల్చిన ముస్లిముసైనికులతోను సుమారు నెలదినములకు ముందు నే నా యాశ్రమముపై వెడలితిని. దాసుగారి ప్రతిభ, ధర్మబుద్ధి, ప్రజానురాగము నే నెఱుఁగక పోలేదు. ఖానుఁ డొసఁగఁబోవు నుద్యోగము నాకనులు గప్పి యాశాపరవశుఁ జేసినది.

ఆతఁ డొసఁగిన తుపాకులతోను, నాటుకత్తులతోను నర్ధరాత్రమున నాశ్రమమున కించుక దూరముగాఁ జిన్నకొండపై నున్న దాసుగారి మందిరమును ముట్టడించి తలుపు దట్టితిని. కొలఁది నిముసములలో నొక దివ్యసుందరవిగ్రహము నాకుఁ బ్రత్యక్ష మయ్యెను. సామాన్యమైన శరీరము, బచ్చని మేని కాంతి, ప్రసన్న గంభీరములయిన నయనములుఁ, జిరాకు గనరాని కనుబొమలు గలిగి, యేకంగారును లేక, వచ్చిన యేఁబది మందిని దాసుగారు చూచిరి. "ఏమిది? యింత ప్రొద్దు పోయి వచ్చితిరి. మీ కేమి గావలయును? నాసర్వశక్తులు వినియోగించి మీకు సాయము చేయఁగలను. మీ కోరిక యెట్టిదో తెలుపుఁ" డని నిశ్చలముగా వారు పలికిరి. నానోటినుండి మాట రాలేదు. నాయనుచరుఁ డొకఁడు "అయ్యా! మీమాటలకు మోసపోవువారము గాము. మీ దగ్గరనున్న సొత్తంతయు దీసికొని మఱియు వెడలఁగల" మని హెచ్చరించెను.

దాని కాయన చెక్కుచెదరక "మీరు ధనముకొఱకే వచ్చిన నింత శ్రమ యవసరము లేదు. ఇదిగో, ప్రస్తుతము నాదగ్గరనున్న సొక్కము. దీనిందీసికొని మీ కిం కేమి కావల

యునో యెఱింగింపుఁ" డనుచు లోనికేగి వచ్చి ధనపుసంచి మావాని కందిచ్చెను. వెంటనే వెనుదిరుఁగుడని నావారి కాజ్ఞయిచ్చితిని. ఇఁకఁ దప్పక యుద్యోగము లభించునని యాసించితిని.

కాని యింకను ధనముగలదేమో చూడనీయలేదనియు, జవాహిరీకూడ నుండకపోదనియు ముస్లిములు చెప్పిన మాటఁ బట్టుకొని యధికారి నన్నుఁ గొంచె మిూసడించెను. దీనికిఁ బ్రతిక్రియ యెట్లు చేయుదునాయని తఱివేచియుండ నాయధికారి మరలఁ గబురంపి "పెద్దాపురమునుండి యెవ్వరో గూఢచరులు వచ్చిరని తెలిసినది. వారిని వెంటాడి, వీలయిన బంధించి తీసికొనిరమ్ము. ఇది జయప్రదముగా నెఱవేర్చిన నీవు తప్పక సైనికాధికారివి కాఁగలవు" అని చెప్పెను.

అయిదాఱుగు రనుచరులతో మిూవెంటఁ బడితిని. నా యనుచరులలో నొకరిద్దఱు కొంతదూరము వచ్చి వెనుకకు మరలిపోయిరి. నాకును మిూయాకృతులు చూచినంతనే మనసు మాఱిపోయినది. మిూవంటి పుణ్యాత్ములకు ద్రోహముచేసి నేనేమి పున్నెము మూటగట్టుకొందును? కాని యింతదనుకవచ్చి నే నూరకున్నను నాతోనున్న యిరువురు ముస్లిము భటులూరకుందురా? వెనుదిరిగిపోయిన, ఖానుఁడు నన్నే రీతి గౌరవించును? నా కేమియుఁ బాలుపోలేదు. ముందునకు బోనిచ్చి వెనుకపాటున వారిద్దఱిని నఱికివైచితిని. నా ఖడ్గము గ్రోలిన రక్తధార యింకను దడి యాఱలేదు. నేఁటినుండి యాకత్తితో నిఁకఁ బనిలేదు" అని పలికి గిఱ్ఱునఁ ద్రిప్పి

దానిని ముండ్లతుప్పలలోనికి విసంవైచెను. "క్షమించితిమి" అన్నచో నిఁక నెట్టిదుష్కృత్యముఁ జేయను. ఏలిన వారికి దయకలిగి నా కేసేవ యొసఁగిన దానిని నెఱవేర్తు" నని యాతఁడు పలుకుచుండఁ గనులవెంట నశ్రుధారలు కాలువలు గట్టసాగెను. ఒకించుకయాగి మరల "మహాఋషి, దేవుని యవతారము దాసుగారికి నేఁ గావించిన యపరాధము నకు నా కెన్నిజన్మలకైనఁ బరిహారము గలదా?" యని వెక్కి వెక్కి యేడువఁజొచ్చెను.

వారి కాతని ప్రవర్తనలో నింతవఱకుఁ గలుగుచువచ్చిన సంశయమాలిన్యము నాతని యశ్రుధారలు క్షాళన మొనరించి వైచెను. ఇఁకఁ గాలాతిక్రమణమున కోరువక యాతనిఁ గూడఁ దీసికొని వా రతివేగముగాఁ బెద్దాపురమార్గముఁ బట్టిరి.

---

# 10. నిర్ణయము

నాఁడు పెద్దాపురము నగరమంతయు సంచలనముతోఁ గూడియున్నది. గుఱ్ఱపురౌతు లిటునటు దిరుగుచున్నారు. ప్రజ లచటనచట గుంపులుగూడి గుసగుస లాడుచుండిరి. అందఱు భయాక్రాంతులైనట్లు కానఁబడుచుండిరి. కొన్ని సేనలు వచ్చి నగరమువెలుపలనున్న సూచనలు గానవచ్చుచున్నవి.

రాజగృహాభ్యంతరమందిరములోఁ దిమ్మజగపతి, బలభద్ర జగపతి, రాఘవమ్మాదేవియు నుచితాసనములపైఁ

గూరుచుండి సంగతులు ముచ్చటించుచు నెవరికొఱకో నిరీక్షించుచుండిరి. కొలఁది నిముసములలో నొక ముప్పది వత్సరముల వయసుగల యువకుఁడు వచ్చి వారికి నమస్కరించెను. వారు సెలవిచ్చినపిమ్మట నాతఁడును దగ్గరనున్న యున్నతాసనముపైఁ గూర్చుండెను. ఆతడు మిక్కిలి బలాఢ్యుఁడు. విశాలములు, నిర్మలములు, దృఢసంకల్పసూచకములు నగు నాతని కను లాకర్షణీయములు. నాతిదీర్ఘమై కడునల్లగానున్న యాతని గడ్డము ముఖమునకు మఱింత సొగసు గూర్చుచుండెను. ఆతని దుస్తులు, నాకారము, నాతఁ డుత్తమ మహామ్మదీయ యువకుఁ డని చెప్పక చెప్పును.

అపుడు రాఘవమ్మాదేవి "ఓయీ! వింటివికదా సంగతులన్నియు! ఇపుడు కార్యనిశ్చయము చేయవలసిన యవసరము వచ్చినది" అని పలుకుచుండఁ, బరిచారకుఁడు దారిఁజూప సుబ్రహ్మణ్యసోమయాజులుగారు, వీరవర్యుఁడు చల్లా రాజన్నయు లోనికిఁ బ్రవేశించిరి. మహారాజ్ఞిచే నిర్దేశింపఁ బడిన యాసనము లధిష్ఠించిరి. రాజ్ఞి మరల నుపక్రమించెను.

"గురువర్యా! వీరవరేణ్యులారా! సుమా రిరువది వత్సరములకుఁ బూర్వ మీ నాబిడ్డ లిరువురుఁ బసికందులై యుండఁగాఁ బెద్దల యాశీఃపూర్వకమగు ననుజ్ఞతో నీ రాజ్య భారము నేఁ జేపట్టవలసివచ్చినది. మహాప్రభువుల వెనువెంట నే నమరపురి కేఁగవలసియున్నను 'దేవీ! ఎన్నో తరముల నుండి సకలవిధములఁ గీర్తితో విరాజిల్లిన సంస్థానమును శక్తి

కొలఁదిగాపాడి, కల్లోలము లణఁచి, యాదాయముఁ బెంపొం దించి ప్రశాంతముగఁ జేసికొని వచ్చితిని. మత కల్లోలములు, ముస్లిముల తిరుగుఁబాటులు లేకుండ వారినిఁ గూడ నుద్యోగము లిచ్చి గౌరవించి సామరస్యముతో నడుపుకొని వచ్చితిని. ఈబాలురు కడుఁబసివారు. యుక్తవయస్కులయినచోఁ దప్పక యిప్పటి యేర్పాటులు వేనికి భంగము రాకుండ సంస్థానపుఁ గీర్తి నిలువఁబెట్టఁ గలరని నాకు నమ్మకము గలదు. వీరి యాకారములు, బాల్యచేష్టలే యీసంగతి దెలుపుచున్నవి. కాని వీరాపనికిఁ బూనుకొను సమయము వచ్చువఱకు వీరిం గాపాడి సకల యోగ్యతలు గఱపుటకు విద్యావివేక సంపన్నురాలవైన నీవుతప్ప మఱెవ్వరు సమర్థులు? సర్వదా రాజ్యహితము గోరు సకలోపాయచతురులు సోమయాజులుగారు, జాతిదేశభేదము లణుమాత్రమైన మనసున నుంచుకొనక యేకకుటుంబములోని వానివలె మసలు రుస్తుంఖాను, మున్నగువారి సాయము నం డగాఁ గొని యీరాజ్యభారము నీవు వహింపుము. ఈవాక్యమనుశాసనముగాభావించి, సహగమనముమాట స్మరింపకుము. కులాంకూరములఁ బోషింపు ” మని పలుకుచుఁ గనులుమూసిన ప్రభుని యాజ్ఞను మార్పించుకొనుటకైన నవకాశములేక యిట్లు జీవించి చాలవఱకు వారియాజ్ఞ నెఱవేర్చుకొని వచ్చుచుంటిని.

నేఁటికి రుస్తుంఖా నింతపనికిఁ బూనుకొనెనన్న నా యాత్మయే నన్ను వంచించిన దనుకొనుచున్నాను. ఎవ రెన్ని చెప్పి నను నమ్మక, వినక యాతని నాత్మ సోదరుఁగా భావించి మను

చుట మీయందఱకుఁ దెల్లమ కదా ?" యని పలుకుచుండ నామెకు భర్తృపాద స్మరణమునఁ గనుఁగొలఁకులనుండి యశ్రుకణము లురలఁ దొడఁగెను. వాని నామె యతిప్రయత్నముఁ జేసియు నిరోధించుకొనలేక చేళాంచలముతోఁ దుడుచుకొనుట యందఱును విలోకించిరి.

అపుడు తిమ్మజగపతి దీనికై యింత విచారమేల ? కేవలము మనమై యనవసరముగా నొకరిపై దండెత్తి ప్రజలను మారణము చేయుట కిష్టపడము. కానియుద్ధమే తప్పనిసరి యయినపుడు శక్తి వెల్లడించి సంస్థాన కీర్తిలత యాశాంతరముల నల్లుకొను నట్లుచేయకుందుమా ?"యన, బలభద్రజగపతి "తల్లీ ! మేముయుద్ధముఁ గూర్చి శాస్త్రపద్ధతులలో శిక్షణ మొందుటే కాని ప్రత్యక్షానుభూతిచే నానందించుట కదనురాక చూచుచుంటిమి. ఇది మాకుఁ బర్వమువలెఁ దోఁచుచుండ దీనికై యింత తర్కమేల ? నేనును నూరుద్దీనుఁడును రణరంగమున విజృంభించినపుడు శత్రువులు కన్నెత్తియైనఁ జూడఁగలుగుదురా ?" యని ప్రశ్నార్థకముగా నూరుద్దీనువంకఁ జూచెను. నూరుద్దీను విషయమై యెవరికి నేసంశయము లేకున్నను నందఱి కను లప్రయత్నముగా నాతనిపైఁ బడినవి. ఆతఁడు "తల్లీ ! రుస్తుంఖాను దురుద్దేశముతోనే యిటకువచ్చినట్లు నిర్ణయమైన మఱుక్షణమునఁ దమయాజ్ఞయైనచో నేనొక్కఁడనే వానిమదమణఁగించి వచ్చినత్రోవఁ బట్టునట్లు చేయఁగలను. తిన్నయింటివాసములు లెక్కయిడుటే యాతని యాశయమైన నాతని నేఁ దండ్రిగా

భావింపఁజాలను. నాకుఁ దల్లియుఁ, దండ్రియు, సోదరీసోదరులు, సర్వస్వము రాఘవమ్మాదేవిగారే. జ్ఞానము వచ్చినది మొదలు వేఱుభావ మెఱుఁగ" నని నిశ్చలముగాఁ బలికెను.

"ఈవిషయమై నాకు నూరుద్దీనునకును వివాదము తప్ప నట్లున్నది. తానొక్కఁడే వీరవిహారముసల్పిన నాకుతుకముదీఱు టెట్లు?" అని బలభద్రజగపతి వచింప సోమయాజిగా రందుకొని "కుమారా! బలభద్రా! నూరుద్దీన్! సమయమువచ్చినపుడు మీరుచెప్పినయంతయుఁ జేయఁగల ధీరులగుట కెట్టిసందియమును లేదు. కాని యిపుడు ముందుగాఁ దేల్చుకొన వలసినయంశము లనేకములు. ఏపని చేసినను పెద్దాపురపు వీరక్షత్రియులు ప్రజల మేలే ప్రధానముగా నాలోచించి చేయుట యిప్పటికిఁ గొన్ని తరములనుండి వచ్చుచున్న యాచారము. దాని కావంతయు భంగములేని మార్గము మనము నిశ్చయించు కొనవలయును. రుస్తుంఖా నెంతసైన్యముఁ దీసికొనివచ్చెనో? ఏయుద్దేశముతోఁ దీసికొనివచ్చితి ననునో? వీరవరేణ్యులు రామరాజుగారు, సుబ్బన్నగారు, కృష్ణారాయనింగారు నేమైనారో? తెలిసికొన వలయును. అనంతరము మన మాతఁడు కోటను ముట్టడించినఁ బ్రతిఘటించుటా? కోటవెడలి యాతని సేనను డీకొని తటిమి వేయుటా? యను సంగతి నిర్ణయింపవలయును" అని పలికిరి.

రాఘవమ్మాదేవిగా రామాటలు విని తమ యభిప్రాయము లిట్లు వివరించిరి. "మహాత్మా! మీ యూహలు గంభీరములు. ఇందు సకలవిధముల మార్గముఁ జూపవలసినది

మీఁరే, ఖానుని సేన సుమారు నలువదివే లుండుననియు, నాత డాంధ్ర దేశాక్రమణోద్దేశముతో నున్నాఁడనియు, దారి వెంబడిఁ బ్రజలఁ బీడించి, కొల్లగొట్టి నానాభీభత్సముఁ జేసినాఁ డనియు రామరాజుగారు చెప్పిరి కదా! పోనీ, యాతఁ డాంధ్ర సామంతులనుండి కప్పము రాఁబట్టుకొనుటకే వచ్చినా డనుఁడు. రామరాజుగారు, సుబ్బన్నగారు నన్నట్లు గోలకొండసుబేదారు స్వతంత్రించినంత మాత్రమున నాతనికిఁ గప్పముఁ గట్టవలసిన పని యేమున్నది? ఢిల్లీపాదుషాకుఁ గూడఁ బేరునకు సామంతులేకాని, నిజముగా నెవ్వరు నెన్నఁడు, గప్పముఁ జెల్లించి యుండలేదే! ఇట్టివాఁడు మన సంపూర్ణస్వాతంత్ర్యమును మాత్రము గుర్తించి గౌరవించు నను నమ్మకమేమున్నది? అయినను మనము తొందరపడి యాతనిపైఁ బోరాదని తలఁచి రాజవరేణ్యు లెంత వేడినను నోరిమి వహింపుఁడని చెప్పితిమి కదా! ఇట్టిస్థితిలో నాతఁడు పాండవులమెట్టపై సేనలతో విడియుట కేమికారణము? ఒకవేళ యుద్ధపుటూహతోనే వచ్చిన; రెండు దినములనుండి యాతఁ డాలస్యముగావింప హేతు వేమి? ఈ యంశములన్నియుఁ బ్రముఖులు నిర్ణయింపఁదగినవి.

ఆతఁడు యుద్ధసన్నద్ధుఁడై వచ్చిన; నే పరిస్థితులలోనైనను వెనుదివియక యాతనికి సమాధానముచెప్పుట మన కర్తవ్యము. ఆతనిసైన్య మసంఖ్యాకముగా నున్నదని తెలియుచున్నది కదా! మనకిచట మూలబలముగానున్న సేన యయిదాఱు వేలకు మించియుండదు." అనియామె వివరించుచుండ

నపుడు తిమ్మజగపతి "యార్యులారా! నలువదివేల శత్రు సేనకుఁ బదివేలు మన సేన యవసరమా? యని నా సందేహము. అయినను మన యధీనములోనున్న ముఠాలనుండి యొక్కొక్క ముఠాదారై దువందల సైనికుల నంపినను మనకింకొక వైదు వేలకుఁ దక్కువగాకుండ సేన సమకూఱునుగదా!" యనెను. రాగమ్మగారపుడు "వారందఱికి వర్తమానములుచేసి సైన్య ములతో వచ్చువఱకు వ్యవధికలదా? యని నా సందేహ" మనిరి.

సోమయాజులుగారందుకొని "తల్లీ! క్షమింపుఁడు. మూఁడురోజులనుండి కానఁబడుచున్న పరిస్థితుల ప్రోద్బలము వలన నెందుకైన మంచిదని ముఠాదారు లందఱకు లేఖలు వ్రాయించి వార్తాహరుల నంపియున్నాను. ఈలేఖలు జూచు కొని వారీపాటికి బయలు దేరియే యుందురు. అవకాశము చాలనందున నీపని స్వతంత్రించి చేయవలసి వచ్చినది." యని పలుక రాజన్న "గురువరేణ్యుల జాగరూకత మెన్నఁదగిన" దనెను. దానికి రాగమ్మగారు "రాజన్నా! వారి ధీవిశేష సాహాయ్యమే లేకున్న నీవత్సవాయ వంశతరువు పల్లవకుసుమ ఫలశోభితమై చిరకాలము ప్రజాసౌఖ్యామృతఫలము లెట్లొ సఁగఁ జాలియుండును? వానప్రస్థాశ్రమమునకుఁ బోవనెంచియు మాబాబులు స్వతంత్రు లగునంతవఱకుఁ, దమస్థాన మాక్ర మింప జాలు మంత్రిసత్తములు లభించునంతవఱకు నిలువ మాకోరికపై సంపూర్ణకటాక్షముచేతనే కదా వారంగీకరించి నది!" యని సమర్థించెను.

ఏ రీతులు సంభాషించుచుండఁగనే యొక రాజభటుఁడు వచ్చి, వంగి నమస్కరించి "యొక ముస్లిము ఉద్యోగి రాయబారముఁ దీసికొనివచ్చి ప్రభుదర్శనమునకై ద్వారముకడ వేచియున్నాఁ" డని విన్నవించెను. సోమయాజులుగారి యాజ్ఞచే నా భటుఁ డేగి యాముస్లిము సైనికోద్యోగిని దీసికొనివచ్చెను. "మా యధిపతి రుస్తుంఖానుఁడు వందనములతో నీ లేఖ మహారాజ్ఞి రాగమ్మగారి కందఁజేయఁ బంపినాఁ" డని వచించి లేఖ నామెయెదుట నాయధికారి సమర్పించెను. ఆమె దానిని గ్రహించి, యాతని సెలవిచ్చి పంపివైచి, లేఖఁ జదువుఁడని సోమయాజులుగారి చేతికందిచ్చెను.

"మహారాజ్ఞీమణి రాఘవమ్మాదేవిగారికిని, రాజకుమారులకును వందనపురస్సరముగా రుస్తుంఖాను పంపుకొన్న విజ్ఞాపనములు.

అమ్మా! మహారాజు శ్రీరాయ జగపతిగారి యపూర్వానురాగముచేతను, దమ వాత్సల్యముచేతను వర్ధిల్లి యే లోటును లేకుండ శక్తికొలఁది పెద్దాపుర సంస్థానమునకు సేవ చేసియున్నాను. కారణాంతరములవలన సంస్థానసేవ వీడి పోవలసిన దుర్గతి నాకుఁ బట్టినది. అయిన మీదయవలనఁ గళింగము రాజమహేంద్రవరము సర్కారులకు సర్ లష్కరుగా నన్ను నియమించిరి. దుర్గ రక్షణార్థము కొంత సైన్య మొసఁగి పంపఁగా వచ్చుచుంటిని.

నేను దేశాక్రమణోద్దేశముతో వచ్చుచుంటినని వంకఁ బెట్టి రామరాజుగారు, సుబ్బన్నగారు ననువారు న న్నసేకవిధములఁ బీడించిరి. అదిచాలక తమ చెంతఁజేరి, నాయెడ మీకుఁ గల వత్సలభావము విఱిచి, నాపై రోసమెక్కించుటకు యత్నించిరని వింటిని... కలనైన నూహింపరాని యిట్టి నిందలచే నా మనసు క్షోభించిపోయినది. నేను మార్గమునఁ జేసిన యుద్ధమాత్మరక్షణార్థముగాని వేఱొండుగాదని వివేకవతులగు మీరు గుర్తింపలేకపోరు. నా సకలశ్రేయములకుఁ గారణమయిన పెద్దాపురము వృద్ధిలోనుండుటఁ జూచి నాకన్న నెక్కుడు సంతసింపఁగలవా రెవరు? నైజాము ప్రభువరేణ్యులును మీ న్యాయపరిపాలనముఁ గూర్చియుఁ, బూర్వమునుండియు సంస్థాన ప్రభువులు సోదరముస్లిములపైఁ జూపు నాదరముగూర్చియు విని, మిక్కిలి యానందించిరి. మీ రాజ్యపు సర్వస్వాతంత్ర్యమును గుర్తించి, మీతో స్నేహముస్థిరపరచుకొననభిలషించుచున్నారు.

నాపైఁగల నింద లసత్యములని మీకు విన్నవించి, నైజామువారి స్నేహపూర్వక సందేశమును వివరించి వెడలుటకై యిచటికి వచ్చితిని. నా యందే లవ మేని దోషము తమకు స్ఫురించినచో నన్ను క్షమింపుఁడు. వీరవరేణ్యులగు కుమారరత్నముల దర్శన మొక్కపర్యాయము నాకుఁ గల్పింపుఁడు. వారికి నాకష్టములు స్వయముగా మనవి చేసికొని నాచేతులఁ బెరిఁగి, యుక్తవయస్కులై యభివృద్ధిలోనున్న వారిదర్శనమునఁ గనులు సఫలీకరించుకొని రేపటి యుదయము

ననే రాజమహేంద్రవరముఁ జేరుకొందును. నాలేఖ పఠించి నాహృదయమందలి నిష్కాపట్యమును గ్రహింపఁగలరని, నాకోరికను మన్నింతురని వినయపూర్వకముగా మఱిమఱి వేఁడుకొనుచున్నాను.

ఇట్లు విధేయుఁడు,

రుస్తుంఖాన్,

రాజమహేంద్రవరము సర్‌లష్కరు."

అని సోమయాజులుగారు లేఖ సాంతముగాఁ జదివిరి. బల భద్రజగపతి నవ్వి "చిరకాల మిచట నున్నందునఁ జక్కని యాంధ్రభాషా పాండిత్య మబ్బినది. అది యీలేఖ వ్రాయు టలోఁ జాల నుపకరించినది" యని పలికి "విచిత్రముగానున్నది. రామరాజాదులు దుర్మార్గులా? మనలను వంచించినారా? రుస్తుము నిక్కముగాఁ బెద్దాపుర శ్రేయస్సును గోరుచు న్నాఁడా?" యనెను.

సోమయాజులుగారు "తల్లీ! రామరాజుగారును, సుబ్బన్నగారును మరలఁ గనఁబడినఁదప్ప నీవిషయము నిర్ణ యింపఁజాలము. అది యటుండనిండు. రాకొమరుల దర్శనము రుస్తుమున కొసఁగుటలో మీయభిప్రాయమే" మని సూటిగాఁ బ్రశ్నించెను. గమనింపఁగలవారి కాప్రశ్నలో సోమయాజులు గారి యనిష్టము తప్పక గోచరించును.

రాగమ్మగారు "గురుదేవా! ఈ సమయమున వీరిని బంపుటయే మేలని తోచుచున్నది. మనదగ్గఱనున్న సేన

యించుమించుగాఁ బదివేలుమాత్రమే. వీరులు రామరాజుగారు, సుబ్బన్నగారు నీసమయమున నున్నఁ గొంత యుపకరించెడి వారేమో! వారు లేకుండఁబోవుటే కాక యిచటినుండి కొందఱు సేనకుఁ బనికివచ్చువారిఁ గూడఁ గొనిపోయిరి కదా! మన ముఠాలనుండి యేలకో యొక్కచోటినుండియు నింత వఱకు సాహాయ్యము చేరియుండలేదు. మన వార్తలు వారి కందినదియుఁ లేనిదియుఁ దెలియదు.

అదియుఁగాక స్నేహముఁ గోరువారితో సఖ్యము నంగీకరింపక యెదిరించు టేమంత మంచిపని? విపరీతమయిన సేనతో నాతఁడు కోట ముట్టడించిన నొకవేళ మన శక్తి యుక్తులన్నిటి నుపయోగించినను మనకు జయము సందిగ్ధము. ఓటమియే సంభవించిన నాతఁడు కోరునంత కప్పముఁ జెల్లించుచు శాశ్వతముగా సామంతులమై యుండవలసి వచ్చును. మఱియు నంత సైన్యము గల్గియుండియు మనతోఁ గపటవు రాయబారములు సలుపవలసినపని యేముండును? నూరుద్దీను మనయొద్ద నుండగా నాతఁ డీ రాకొమరులకు హాని తలపెట్టఁ జాలఁడు." అని వచింపఁ దిమ్మజగపతి యామాటలు విని "యమ్మా! ఆతని సేనాబలమునకు వెఱవ నవసరము లేదు. పదివేలమంది యాంధ్రసైనికులు ముప్పదివేల శత్రుయోధుల జయింపలే రనుటకన్న నపఖ్యాతిలేదు. కాని యనవసరముగాఁ బ్రజాక్షయము గలుగకుండ నాతనిసంకల్పము మంచిదే యయి నపుడు సంధి గావించుకొనుట మేలని నాకుఁ దోఁచుచున్నది"

యనెను. "మన పెరటి గుమ్మములోనికి వచ్చి మోసగింప యత్నించునా?" యని రాజన్న పలికెను.

బలభద్రునకుఁ గోప మాగుటలేదు. "తల్లీ! యుద్ధమనఁ బ్రియముగాఁ దలఁచుచున్న మా కాతఁడు హానియెట్లు తలఁపెట్టఁ గలఁడు? సంగరము తప్పిపోవునను విషాదముతప్ప నాతని దగ్గఱకేఁగ మాకింకొక భయ మనవసరము. వేలకొలఁది వీరులఁ గరవాలమునకు బలిచేయఁగల ధీరులముగాని భీరువుల మైన యబలలము గాముగదా!" యని యాతఁడు గర్జించెను.

ఈ మాటలన్నిటిని సోమయాజులుగారు నిశ్చలముగా వినుచుండిరి. "తల్లీ! ఇట బాగుగా విచారించికాని యేపనియుఁ జేయరాదు. ఏలకో యీతని వ్రాఁతయంతయు సత్య మని నాకుఁ దోఁపకున్నది. ఇందుఁ జాలసంశయముల కెడము గలదు. రాజమహేంద్రవరదుర్గమున కేమిహాని కలిగినదని యీతఁడు నలువదివేల సేనతోవచ్చినాఁడు? దుర్గరక్షణమున కని సేనలుదెచ్చి, యాసేనలతోఁగూడ దుర్గము విడిచి యింతదూరము వివేకవంతుఁ డెవఁడైన వచ్చునా? అంతయభి మానమేయున్నవాఁ డిచటికే యేల రారాదు? కుమారుల నటకుఁ బంపుటకు నాకెంతమాత్రము మన సొప్పకున్నది. ఊహ పుట్టకుండవలయునేకాని నూరుద్దీ నున్నంత మాత్ర మున నాతఁడు తనపని మాను స్వభావము గలఁవాఁడుగాఁడు" అని తమయభిప్రాయ మెఱిఁగింప; రాణి "మహాత్మా! మీరు చెప్పినట్లు సంగతులన్నియు విమర్శింపవలసినదే. ముప్పది నలు

వదివేలసేనఁ దీసికొనివచ్చుటలోఁ గారణము లేక పోలేదు. అన్వరుద్దీను నధికారముఁ దొలఁగించి రాజమహేంద్రవరమునఁ దన్ను నియమించుటవలన నాతఁ డాగ్రహమున నెత్తిరావచ్చు నని రుస్తుమీా సేన దెచ్చియుండవచ్చును. రామరాజాదులను మనమే ప్రోత్సహించి పంపితిమని యాతఁ డూహించి వారి వలనఁ జిరాకులేకుండఁ జేసికొనుటకై యిటకు వచ్చియుండను వచ్చును. మనవీరులయందు విశ్వాసములేక కాని, యుద్ధము నకు జంకి కాని బెదరుచుంటిననని గురుదేవులు తలఁపరని నమ్ము దును" అని చెప్పుచున్నంతలో గూఢచారియొకఁడు వచ్చెను. సోమయాజులుగారు విశేషము లేమని యడుగ నాతఁ డీ క్రింది సంగతు లెఱిఁగించెను.

"రుస్తుంఖానుఁడు పాండవులమెట్టమీాఁద సేనతో విడిసియున్నాఁడు. రాజకుమారు లచటికివచ్చి దర్శనమిచ్చి నచో స్నేహము దృఢపఱచికొని పోవఁదలఁచి రాయబార మంపి నాఁడు. ఆతనికిఁ గలసేనలు విపరీతములు. యుద్ధముజరి గినచోటి జనుల ధన మానప్రాణములకు హాని మిక్కుటము. వీరులగు ప్రభువులు సంధి కిచ్చగింతురనుట కల్ల. ఇఁక నెటు లైన నన్నియాపదలకుఁ సిద్ధపడి యుండవలయును. ప్రతిష్ఠకై పెనఁగులాడుట మంచిదికాదు. ఇంతకు నాలుబిడ్డలతోఁ గడ గండ్లపాలగు యోగము దేవుఁడు మనకు వ్రాసిపెట్టియున్నాఁ డేమో!" ప్రజలాడుకొనుమాటల సారాంశ మియ్యది. వాగ్దోషములున్న భృత్యుఁడు క్షంతవ్యుఁ" డని పలికి సెలవు

పుచ్చుకొని యాగూఢచరుఁడు వెడలిపోయెను. 'సామాన్య ప్రజల కిట్టిభీతి సహజ' మని సోమయాజులుగా రనిరి.

ప్రజలక్షేమమే ముఖ్యమనుకొను మనము జనవాక్యము ప్రకారముచేయుట యిహపర శ్రేయస్సాధనము. నూరుద్దీనునిఁ దోడిచ్చిపంపిన నేభయ మవసరములేదు. ఏమినూరుద్దీన్!" అని రాగమ్మగారు ప్రశ్నించిరి. "తల్లీ! యేమిచెప్పుదును? రాయబారములోని సంగతులు నిజమైన నెంతబాగుగా నుం డును? యుద్ధమునకే నిశ్చయించిన జయముపట్ల నాకు సంది యము లేదు. రాజసుతులవెంట నన్నుఁ బంపినఁ బ్రమాదము లేదనియే నాతలఁపు. నూరుద్దీన్ కంఠమునఁ బ్రాణము లున్నంతవఱకు వారి కపాయము కలుగనేరదు. కలిగినయనం తరము రుస్తుంఖాని శిరము కొలఁదినిముసములకన్న నెక్కువ కాలము నిలిచియుండదు" అని యాతండు సమాధాన మిచ్చెను. సోమయాజులుగారు మాత్రము "రాజపుత్రులఁ బంపుట నాకెంతమాత్ర మిష్టముగాదు. వే తేయుపాయమైన నాలోచింపఁదగు" నని దృఢముగాఁ జెప్పిరి.

మరల రాజ్ఞి "గురుదేవా! మీరాజాగరూకత స్తుతి పాత్రము కాని నేను భిన్నముగానే నిర్ణయముఁ జేయుచు న్నాను. 'సంధికవకాశముండఁగాఁ బ్రజాక్షయ కారణమయిన కయ్యమునకుఁ గాలు దువ్వి రనునిందకు మనమొడిగట్టరాదు. ప్రజల యభిప్రాయము వినియేయుంటిరి కదా! కుమారులారా! నూరుద్దీన్! మీరు ప్రయాణమునకు సిద్ధముకండు. వ్యవహార

ములు పొసఁగక భేదములు వచ్చినపుడు శత్రువులెట్లును మన బలము నెఱుంగఁగలరు. వేళ యతిక్రమించుచున్నది. కావున నిప్పటికి విరమింతము" అని యందఱకు సెలవొసంగెను.

రాణినిర్ణయమునకు సోమయాజులుగారు మిక్కిలి విచారించిరి. "ఎన్నఁడును నేవిషయమున నామాట యతిక్రమింపని యీమెకు నేఁ డిట్టిబుద్ధి యేల కలిగెను? యుద్ధ మనఁ బండువుగా భావించి యుబ్బిళ్లూరు రాజకుమారులును దమ గౌరవమునకు భంగమని భావింపక యచటి కేఁగుటకే తలపెట్టుట దైవవిలసితము. తమ సమస్తమానప్రాణములును రాజభక్తితో నర్పింప సిద్ధముగానున్న యీ పురవాసులు యుద్ధమునకు విముఖముగా నున్నా రనుకొనుటకన్న వెఱ్ఱితన మేమున్నది? ప్రజాభిప్రాయమునకుఁ దలయొగ్గు నూహతో వీరందఱుఁ బ్రమాదము నూహింప లేకుండిరి. గూఢచరుని వాక్యములును సంశయాస్పదములు. ఖానుని యుద్యోగి రాయబారముఁ దెచ్చునరికే ప్రజలు సంగతియంతయుఁ దెలిసికొని యుండుట యసంభవము. ఈ ప్రజాభిప్రాయమును ఖానుని ప్రచారమే యైయుండవచ్చును. 'ధర్మభరితములగు నీవంశాంకురములఁ గాపాడలేకపోయె' నను నిందను సర్వేశ్వరుఁడు నా నుదుట వ్రాసిపెట్టి యున్నాఁడు కాబోలు !! ఈ దుస్తుము ప్రయత్నమున మోసముతప్ప మఱె ద్దియు నాకు గోచరించుటలేదు."

ఇట్లాలోచించి రాజన్నను రహస్యముగాఁ బిలిచి "వీరాగ్రణీ ! నీ సామర్థ్యము జూప నిదే సమయము వచ్చినది.

ఎవ్వ రెఱుంగకుండ నేఁగి, పాండవుల మెట్టదాపున నున్న వట వృక్షముపై నుండి రాకొమరులు భద్రముగాఁ దిరిగివచ్చు నంతదనుక నప్రమత్తుఁడవై కనిపెట్టుచుండుము.'' అని సలహా చెప్పి పంపెను. రాజన్నయు నీగురుభారము నిర్వహింపఁ గలిగిన నా జన్మము కృతార్థమగు ననుకొనుచు నింటి కేఁగెను.

---

# 11. ప్రయాణము

నూరుద్దీనునకుఁ గూడ రాచబిడ్డలను వెంటఁ బెట్టుకొని యేఁగుటకుఁ గొంచెము సంశయము గలుగలేక పోలేదు. రుస్తుంఖా నాతనికి నొక లేఖ పంపియుండెను. లేఖాంశము లివి:

"కుమారా! నూరుద్దీన్! నన్నుగుఱించి పెక్కువదంతులు మీరు వినియుందురు. నీవు రాజ్యాధిపతివి కావలయునని, యందుకుఁ దగుయత్నములు చేయవలయునని వెనుక నీకు బోధించునపుడు నీవు నిరాకరించితివి. ఏకైకసుతుఁడవు నీవట్లు చెప్పినపుడు నే నెవ్వరికొఱకు రాజ్య మాసింతును? నేను బెద్దాపురముపైఁ గన్ను వేసితి నన్న నిందలు గొంద ఱసూయాపరులు గల్పించినవే కాని వేఱుగావు. పెద్దాపురమువారికిఁ దెలియకుండ రాజమహేంద్రవర దుర్గము వశపఱచుకొనఁ దలఁచిన కొంద ఱాంధ్రరాజులు గలరు. వారిలోనివారే రామరాజు

గారును, సుబ్బన్న గారును. నాహృదయమందలి సద్భావమును మీప్రభువులకు నచ్చఁజెప్పి, వారిమైత్రి బలపఱచుకొని వెడలు నుద్దేశముతోనే నే నిచటకు వచ్చితిని. కన్నతల్లివలెఁ గాపాడిన మహారాజ్ఞికి, నామెబిడ్డలకు హానిచేయ నెవ్వరు తలపోయుదురు? ఈ విషయ మెఱింగించుచుఁ బ్రభుసమక్షమున కొకరాయబార మంపుచుంటిని. నీవును నాయందు సద్భావము గలుగునట్లు యత్నింతు వని నమ్ముచున్నాను.

పై లేఖనుబట్టి తండ్రి కొకపుడు గొంచెము దురాశ జనించినను, బ్రస్తుత మతఁడు నిష్కపట బుద్ధితోనే యున్నాఁడని నూరుద్దీన్ తలంచెను. హిందూముస్లిము స్నేహామింత టితో నిలిచిపోక కొనసాగునుగదా! యని యాతఁ డాసపడెను. అయినను నిట్టి విషమసమయమునఁ గడు జాగరూకతతో నుండవలయునని యాతఁ డెంచి రాజకుమారుల ప్రాణములు తనవిగానే భావించుచుఁ బయనమునకు సిద్ధమయ్యెను.

రాజకుమారులును సముచిత వేషములు ధరించి, ప్రాణప్రదమైన కృపాణములు దాలిచి తమ ప్రశస్తమగు నాజానేయములతోఁ బయనమునకు సన్నద్ధులైరి. మహాతేజముతో వెలుంగుచున్న యీముఫ్వురు నగ్నిత్రయమువోలె నొప్పి చూపఱుల నయనముల కానంద మొసఁగుచుండిరి. తిమ్మజగపతి కొక్కపరి యెడమకన్ను దరినది. సంతతోత్సాహములో, నాత్మవిశ్వాసములో నాతనికది యపశకునముగా స్ఫురింపలేదు. ఒకరినిమించిన యుత్సాహముతో నొకరు గుఱ్ఱముల నదలించు

చుండ నెవ రెవ్వరో గుర్తింప శక్యముగాకుండెను. జానపదు లెత్తిన తలలు వంచకుండ వారిని గన్నుల కఱవుదీఱం జూచుచు జేజేలు వెట్టిరి. ఆకస్మికముగా నొక్కసారి గోచరమై యావీరత్రయము క్షణములో నదృశ్యముకాఁగా వారి కానగర మంతయు శూన్యమై తోఁచెను.

కొలఁదికాలములో వారు పాండవులమెట్టపై నున్న రుస్తుం ఖాను శిబిరముఁ జేరిరి. ద్వారము నొద్దకుఁ జేరఁగానే రుస్తుము స్వయముగా బయటికివచ్చి వారి నఖండగౌరవ పురస్సరముగా లోనికిఁగొనిపోయెను. ఛాయవలె ననుసరించి, సమీపముననున్న జొన్నచేనిలో హయమును నిలిపి, వటవృక్షముపై నిగూఢ ముగా నున్న రాజన్న యిదియంతయు గమనించి, సోమయా జులుగా రనవసరముగా భీతినొంది రని మనమున ననుకొనెను. "కొలఁది కాలములో సంభాషణ ముగించుకొని మువ్వురును వత్తురు. అపుడు వారితోఁ గలిసి యుత్సాహముతోఁ దిరుగుఁ బయనముఁజేయవచ్చును.తమ్ము భీరువులని భావించి రక్షణకొరకు వెంటనంటి వచ్చుట యవమానకరమని బలభద్రజగపతి నాపైఁ దప్పక కోపించును. రాజకుమారునకు క్షమాపణ మెట్లు చెప్పు కొనుట?" ఇట్టి యాలోచనముతో నాతఁడచట వేచియుండెను.

---

# 12. ఘోర కృత్యము

నూరుద్దీన్, రాజకుమారులు—ముగ్వురు రుస్తుంఖాను నభ్యంతరమందిరమున నున్న తాసనాసీనులై యాతనితో నిష్టగోష్ఠి కుపక్రమించిరి. "నలువదివేల సైనికులఁ దీసికొని రా బనియేమి? మార్గమునఁ బ్రజానీకమును బాధింపనేల? యని తిమ్మజగపతి సూటిగా ఖానునిఁ బ్రశ్నించెను.

"రాజమహేంద్రవర దుర్గము నాక్రమింపవలయు నని యెవరిమట్టునకు వారే చాలమంది తలంచుచుండిరి. మీకీ సంగతి దెలిసిన మీరే యీపని ముందుగాఁ జేయుదురను భయమున నెవ్వరును రహస్యము బయలు పొంగ నిచ్చుట లేదు. ఈస్థితిలో నైజామువారు నాతో నలువదివేల సైన్యమంపిరన్న నాశ్చర్యమేమున్నది? రామరాజుగారు, సుబ్బన్నగారు నక్రమముగా నన్నెదిరించి బాధించిరి. ఆత్మరక్షణార్థము వారితోఁ గలహింపక తప్పదయ్యెను. అంతటితో నూరకుండక వారు మీసాయము నకై యత్నించిరి. మీరట్టి యధర్మమున కంగీకరింపనందునఁ బీఠికాపురాధిపతి కృష్ణారాయనింగారిని లోఁబఱచు కొనిరి. ముగ్వురుఁ గలిసి మాదుర్గ మాక్రమింపఁదలచి ముట్టడించిరి. కొంతవఱకు యుద్ధముచేసి తమబలము చాల దని గ్రహించి యెక్కువబలము సేకరించుకొనివచ్చి మరల ముట్టడించు నూహతో నేలూరివైపునకుఁ బాఱిపోయిరి. వారి మీఁద ననవసరముగ నేర మారోపింపవలసిన యవసరము

నాకేమియు లేదు. నేను మార్గమునఁ బ్రజల బాధించితి నన్న వార్త లాప్రముఖులు గల్పించినవే.” యని రుస్తుముఖానుఁ డుచితరీతిని బదులు పలికెను.

బలభద్రజగపతి యప్పుడు ‘రామరాజాదు లట్టి వారన్న నమ్మఁదగ్గ యంశముగాఁగానరా’ దన; “రాజ్యలోభ మెట్టివారి నైనఁ దప్పుడుమార్గము వట్టించు” నని రుస్తుము సమర్థించెను.

ఇంతలో నొక ముస్లిము యువకుఁడు శిబిరము వెలుపల గుఱ్ఱముదిగి, మిక్కిలి యాత్రముతో రుస్తుము సమ్ముఖమునకు వచ్చినిలిచి సలాముచేసెను. “ఏమి కరీంఖాన్! అంత కంగారు పడుటకుఁ గారణమేమి?” యని ఖాను ప్రశ్నించెను.

“ప్రభూ! రామరాజుగారు, సుబ్బన్నగారు, కృష్ణారా యనింగారుఁ బెద్దదండుతో గోదావరి దాఁటివచ్చి మనకోట ముట్టడించిరి. క్షణములోఁ గోట మండిపోవునట్లుండెను” అని యాయువకుఁడు గద్గదస్వరముతోఁ బలికెను.

వానిని బయట నుండు నట్లాజ్ఞాపించి, “మహారాజా! చూచితిరా వారి యాగడము? వారియూహ లిప్పుడైన మీకు బోధపడియుండు” నని రుస్తుంఖానుఁడు పలుకఁగా “మీరొక వేళ మాకు హానిచేయ నిటకు వచ్చితిరని తలఁచి వా రాపనిఁ గావించిరేమో!” యని బలభద్రజగపతి వచించెను.

“ఎటులైన యుద్ధము వెంటనే నిలిచి పోవునట్లు చేయ వలయును. కాకున్న వృథా జనక్షయమగును. కావున నీవు వెడలుటకాని, మీ సేనానియైన రసూల్ఖాను నైన, మఱెవ్వరి

నైనఁ బంపుటకాని మంచి"దని తిమ్మజగపతి రుస్తుమునకుఁ దెలుప నాతఁడు "మహారాజా! సంభాషణలకై వచ్చిన మీతో ముఖ్యవిషయములు మాటలాడకుండ వెడలుట యుచితమా? మఱియు మామాటలతో రామరాజాదులు యుద్ధము మాను దురా?" యని సంశయము సూచించెను.

బలభద్రజగపతి "నూరుద్దీను నట కంపిన సుభయసేన లును యుద్ధము మానవచ్చు" ననెను. కాని నూరుద్దీను వెంటనే "అది యసంభవము. కుమారులను విడిచి యుండనని మహారాజ్ఞి యెదుటఁ బ్రతిజ్ఞ చేసితిని. దానికి భంగము గలు గరా" దనెను.

తిమ్మజగపతి నవ్వి "నీ జాగరూకత ప్రశస్తము. కర వాలము చెంతనుండ మారక్షణమునకు నీయవసర మేమున్నది? క్షణ మాలసించిన ననవసరముగాఁ గొందఱు హతులగుదురు. వెంటనే వెడలి యుద్ధము మాన్పు" మని యాజ్ఞాపించి యాతఁ డింకను సంశయించుచుండ జగపతి "నాయాజ్ఞ నతిక్రమింతువా? మఱుమాటాడకుండ వెళ్ళుదువా?" యని హెచ్చరించెను.

ఈయదను జూచి రుస్తుముఖాను "కుమారా! వీరి రక్ష ణము నీకెంతముఖ్యమో నాకుమాత్ర మంత ప్రధానముగాదా? నిన్నటివఱకు నాకుమాత్రము వీరు ప్రభువులు గారా!" యని యనునయించి కరీముఖానునిఁ బిలిచి "ఓయీ! నీవు వీనితో నేఁగుము. ఈతఁడు నాకుమారుఁడు. పెద్దాపుర రాజకుమారుల ప్రతినిధి. ఈతని యాజ్ఞప్రకారము మెలఁగు" మని చెప్పెను.

ఎన్ని జరిగినను మూరద్దీకున కర్ధమనస్కుతయే కాని వారిని వీడి వెడలుట కిచ్ఛ గలుగలేదు. ప్రభునాజ్ఞ ధిక్కరింప లేక తుదకుఁ "దండ్రీ! వీరిని నీరక్షణమున కప్పగించి వెడలు చున్నాను. వీరు తిరిగి కోటఁజేరులోపల నేహానిజరిగినను నీశిరసు నీకుఁ దక్కదు" అని పలికి, రాజసుతులకు దండముపెట్టి యాతఁడు కరీముఖాను ననుసరించి వెడలిపోయెను.

మీరు కరవాలముఁ న్న జ్ఞప్తికి వచ్చినది. పెద్దాపురమున నూతనకర్మాగారము స్థాపింపబడినదనియుఁ, బ్రశస్తమయిన ఖడ్గములు తయారు చేయఁబడుచున్న వనియు వింటిమి. మీవి యాకర్మాగారమునఁ దయారైనవియా ?" యని రుస్తుంఖాను రాజకుమారులఁ బ్రశ్నించెను. వారాఖడ్గములు తయారుచేసినవారి నైపుణ్యముఁ బొగడుచు 'నివిగోచూడు' మని వానిని రుస్తుమున కందిచ్చిరి. వానియందలి కళ కచ్చెరువు నటించి యాతఁడు తన సేనానియగు రసూలుఖానునిఁ బిలిచి "యివి యెంతప్రశస్తముగా నున్నవో చూడు." మనెను. ఆతఁడు వాని నందుకొని సర్దారులకుఁ జూపి తెచ్చు మిషతో బయటికిఁ గొనిపోయెను.

అపుడు వికటపునవ్వుతో రుస్తుంఖాను "తిమ్మా! పదు నొకండు సంవత్సరములనుండి సర్కారుకుఁ జెల్లింపవలసిన కప్పముఁ గట్టుము" అని పలికెను. వా రిద్ద రిదియే మని యచ్చెరువొందుచున్నంతలో "రాచపురుగులారా! నాశక్తి సామర్థ్యము లెఱుంగక మాయాధిపత్యము నెదిరించి, నే నిచటి

కింత సేసతో నేల రావలయునని 'సముజాయిషీ' యడుగు చుంటిరి. కారణ మిపుడు మీకుఁ దెలిసినదా? నోరెత్తినచో మిమ్ము ముక్కలుగాఁ గోయించెద" నని రుస్తుంఖాను పలుకు చుండ; వెనకనుండి రసూలుఖానుఁడు, నిబ్రహీము నను సర దారులు రాజకుమారులను బంధింప నుంకించిరి.

"ఓరీ తుచ్ఛులారా! కపటము పన్ని కత్తులు లాగు కొన్నంత మాత్రమున నైన దనుకొనుచుంటిరా? నూరుద్దీ నిచట నున్న మోసము ఫలింపదని నీచుండవై యాతని సాగనంపితిరా పిఱికిపందా! పౌరుషమేయున్న మా కత్తులు మాకిచ్చి యుద్ధ మునకుఁ దలపడలేరా?" అని పరుషము లాడుచు వా రిరు వురు రుస్తుంఖానుతోను, నాతని యిరువురు సరదారులతోను బాహుయుద్ధమునకుఁ దలపడి మువ్వురను నేలఁ బడఁగొట్టిరి.

ఇంతలో వెనుకనుండి మఱి మువ్వురు భటులు వచ్చి, ముస్లిమువీరుల మూఁపులపై నెక్కి కూరుచుండి పిడిగ్రుద్దులు గ్రుద్దుచున్న రాజకుమారులఁ జేర వెఱచి వారిపై వలలు విసరి లాగిరి. వారు వానిఁ ద్రెంచుకొనఁ బోవుచున్నంతలో సలసలఁ గ్రాగిన తైలము దూరమునుండి వారిపైఁ జల్లిరి. ఈ సందడిలో రుస్తుము, నిరువురు సరదారులు, లేచి ప్రక్కకుఁ దప్పుకొనిరి. పలువురుసైనికులు లోనికి వచ్చి యంద ఱొక్కుమ్మడి మీఁదఁ బడి రాకొమరుల శిరములు ఖండించిరి.

రుస్తుంఖానుఁ డాశిరములు దనముందర నిడుకొని కూరుచుండి "నన్ను నిందించి బిరుసుగా మాటలాడిన యీ

మూర్ఖుల శిరముల కెంతగతి పట్టినది? వీనిని ధూళిపైఁ బొరలాడున ట్లొకతన్నుఁ దన్ని నాకసిదీర్చుకొందు" నని కాలెత్తి తన్నఁబోవుచుండెను.

వటవృక్షముమీఁది రాజన్నకు శిబిరములో నేదో ఘోరము జరుగు చున్నదని యనుమాన ముదయించెను. వెంటనే జొన్నచేనిలోని గుఱ్ఱమునకై యాతఁడు వెదకులాడెను. ఏహానియు నుండదని యేమఱియున్నందుకుఁ బశ్చాత్తాపపడుచు గుఱ్ఱము నధిరోహించి, యొక్కుదుటున శిబిరమున (వ్రాలి, రుస్తుంఖానుఁడు వెనుకకుఁ బడునట్లొక తన్నుఁదన్ని, యాతని చేతిలో నున్న రాజసుతుల శిరములు క్షణములో లాగుకొని, "తుచ్ఛుఁడా! ఆఁడుదానివలె రణమొనర్పలేని పిఱికిపందవై చేతఁగత్తులు లేనపుడు వీరిశిరములు గటికవానివలెఁ గోసి పరమ పవిత్రమైన వీనిఁ దన్నఁ బూనుటకు సిగ్గు లేదురా? యని గర్జించుచుండ నచటి వారంద ఱా సింహవిక్రమమునకుఁ దాళఁ జాలక చెల్లాచెదరై పాఱిపోయిరి.

ఓరీ! పాఱుఁబోఁతులారా! మీశక్తి యింతటిదా? నేఁటికి బ్రతికిపోయితిరి. ఇఁకఁ బెద్దాపురము వంకఁ గన్నెత్తి చూడక రాజమహేంద్రవరమునకుఁ బాఱిపొండు. లేకున్న మీసైన్యము నంతను దుత్తునియలు గావింతును" అని పలుకుచు నాశిరములఁ జేతఁగొని రాజన్న హయము నెక్కి దాని నదలించెను.

దూరమునుండి రుస్తుము సర్దారులు "పట్టుకొనుఁడు, కట్టుఁడు, కొట్టుఁడు, రాజన్నను నిలువునఁ జీల్చివేయుఁ" డనుచుఁ గేకలు వేయుచుండఁగనే యాగుఱ్ఱము నిముసములో నదృశ్య మయ్యెను.

---

## 13. జోహారు

దైవగతి యూహింపరానిది. ఎంతోకాలమునుండి శాంత్యానందములతో విలసిల్లుచున్న పెద్దాపురము నేఁడు శోకదేవత కాలయమై బీభత్సముగాఁ గానఁబడుచుండెను. ఎచటఁ జూచినను విచారవాక్యములు. 'ఇంత ద్రోహమా!' యని ముక్కుపై వ్రేలిడుకొనువారు కొందఱు. ఎఱిఁగి యెఱిఁగి రాజకుమారుల నిట్లు చేతులార రాఘువమ్మగా రెట్లు పంపఁ గలిగిరి? సోమయాజులుగారి ధీశక్తి యేమైనది? యని కొంద ఱనుచుండిరి. యుద్ధమునకు వెఱచి, సంధి కుదిరిన బాగుగా నుండు ననుకొన్న యొకరిద్దఱు మాత్రము "దైవగతి యిటు లుండ నెవరి నేమనఁ గల" మని వేదాంతవాక్యములతోఁ దమలోఁ దామే సమాధానము చెప్పుకొని తృప్తిపడిరి.

రాఘువమ్మాదేవిగారి మందిరమున కేఁగి రాజన్న వృత్తాంత మంతయు సాకల్యముగా నెఱింగించెను. సోమయా జులుగారి భార్య లక్ష్మీసోమదేవమ్మగారును, నంతఃపురదాసి

గౌరియు, యువరాజ్ఞియు నచట నుండిరి. మహారాజ్ఞి విచారమునకు మేరలేదు. "గురుదేవుల యానతి మీఱక నడుచుకొన్న నింతపుట్టకయుండును. కుమారుఁడు నూరుద్దీను కూడ నుండ నేమి భయ మనుకొంటిని. ఆదురాత్ము లాతని నేమిచేసిరో తెలియదు. ఇంతకును బెద్దాపురరాజ్యలక్ష్మికి నేను తోఁక చుక్కనని లోకులందఱు నిందించుయోగము నానొసట వ్రాయఁబడియున్నది. యుద్ధమున వీరులై పోరునపుడు కరవాలములే చేతనున్న నీసింహకిశోరముల నిట్లు పాదాభిహతిచేఁ బరిభవించుట కా రుస్తుంఖాను తలఁపోయఁగలఁడా? ఓరీ! నీచా, రుస్తుము! నీకన్న కొడుకునే మోసగించి నీ వేదుర్గతికిఁ బోవుదువురా! నీపట్ల మేము చూపిన యౌదార్యము పామునకుఁ బాలువోసి పెంచిన ట్లయినది. నీచేతులతో నెత్తియాడించిన యీసుకుమారుల నిట్లుచేసిన నీ హృదయము పాషాణముకన్నఁ గఠినమై యుండవలయును" అని పెక్కువిధముల విలపించుచుండెను.

"బాలజగపతి నోడిలో నుంచుకొని దుఃఖించుచున్న కోడలి నోదార్చుటకు మాఱుగా మీరే యింత వెఱ్ఱిలోఁబడి బెంబేలెత్తిపోయిన నెట్లు?" అని సోమదేవమ్మగారును, గౌరియు నామె నూరడింప యత్నించుచుండిరి. యువరాజ్ఞి రామయమ్మాదేవి దుఃఖము నుపశమింపఁజేయు నోదార్పు వాక్యములు సంభావ్యములా? ఆమె దుఃఖముచే రుద్ధకంఠయై యొక్కపలుకైనఁ బలుకలేక చిత్తరువువోలె నుండిపోయెను.

సుఖదుఃఖముల తాఁకు డించుకయు లేక, కాలు సేతు లల్లాడించుచుఁ బ్రకాశించుచున్న రాయజగపతిబాలకుమారుఁ డొడిలో లేకున్న నామె సచేతనపదార్థమని యెవ్వరుఁ గుర్తింపఁజాలరు.

మహారాజ్ఞి మాత్ర మెట్లు దుఃఖము దిగమ్రింగఁ గలదు? పౌరుషయుద్ధ మొనరించి రణరంగమున మరణించిన; నావీరమాత కింతభార మనిపింపకపోయెడిదేమో? తన యవివేకలేశమాత్రమున నీవిషయము తటస్థించినదని స్ఫురించిన కొలఁదియు నామెగుండె నీరయిపోవుచున్నది.

"రాజన్నా! ఇపుడు గురుదేవు లెచటనుండిరి? వారేమి చేయుచుండిరి? రాజకుమారుల సంరక్షణ మసాధ్యము కాఁగానే వారిభారము తీఱిపోయినదా? అశేష ప్రజానీకము బిడ్డలవంటి వారుకారా? వారిరక్షణ మేమఱుటకు వీలులేదుకదా!" యని యామె ప్రశ్నింప, రాజన్న "తల్లీ! వారు కోటఁగాపాడుభారము నాపై నిడిరి. మఱియు ముఖ్యమైన కొన్ని రహస్యములు దమకెఱింగింప నాజ్ఞయిడిరి. లెక్కలేని శత్రుసేనలు కోటపైకి వచ్చుచున్న కారణమున వెంటనే కోట తలుపులు మూయించి యప్రమత్తుఁడనై యుండ నాజ్ఞాపించినారు. ఆలసింపక కర్తవ్య మాచరింప ననుజ్ఞ యిం" డని కోరుచుండ శత్రుసైనిక దళములు దుర్గద్వారములను ఢీకొనుచున్న సందడి వినవచ్చెను.

ఆసవ్వడి నాలకించి మహారాజ్ఞి "యిఁక నీ యత్నము నిరుపయోగము. కాకున్నచో నిందఱు ముతాదారులకు సాయమునకై కబురంపఁగా నొక్కరును సమయమునకు

రాకుండుదురా ? రామరాజుగారు, సుబ్బన్నగారు, కృష్ణా రాయనింగారు నిట్టి విపత్సమయమున నున్న నెంత మేలు కలిగి యుండెడిది ? వారి గతి యేమైనదో యింతవఱకు స్పష్టపడ లేదుగదా !' యని యామె నిరుత్సాహమునఁ బలికెను.

"అమ్మా ! మన సరదారులయు, ముఠాదారులయు తప్పేమియును లేదు. మన పంపిన లేఖ యొక్కటియు నెవ రికి నందకుండ ముందుగనే రుస్తుంఖాను గూఢచారులకుఁ జేఁ జిక్కినవి. మన వీరులు ముప్వురు రాజమహేంద్రవర దుర్గము ముట్టడించి, యపారమైన శత్రుసైన్యము నేమియుఁ జేయఁజాలక తోఁటపల్లి మన్యములకు బాఱిపోయిరనియు, నచట నాటవికులను సైనికులనుగా సమీకరించి మరల దండెత్తు టయే వారి యాశయ మనియు గురుదేవులు గూఢచరుల వలనఁ దెలిసికొనిరి. శత్రుపరాజయ దీక్ష వారి గుండెలలో నెంతగాఁ బాదుకొని యున్నదో !! నిలిచినచోట నిలువక, తిన్నచోటఁ దినక యడవుల పాలగుటకుఁ సంశయింపక, స్వాతంత్ర్యమునకై యెట్టిసాహసముల కొడిగట్టు చుండిరి?" యని రాజన్న పలుకుచుండ మహారాజ్ఞికి మతిపోయినది.

"ఇఁక నీయుద్ధప్రయాసమెందులకు? సైన్యమును గ్రమ విధమున నడుపు నాయకు లేరి ? అందఱు నన్నివిధములఁ దొలఁగిపోయిరికదా ! అదిగో ! శత్రువులు 'ఫిరంగు' లతోఁ గోటతలుపులఁ బ్రేల్చుచున్న ధ్వని. నిష్ప్రయోజనముగా నింకను గొన్నివేలమంది రాజభక్తులగు సైనికుల ప్రాణములుఁ,

జారుల ప్రాణములుఁ దీయుట యనవసరము. వీరు కాలాంతర మునఁ దమభక్తిఁ జూపుకొందురుగాక! విరోధులు కోటలోఁ జొరఁబడినచో నిఁక నంతఃపురస్త్రీల గౌరవము నిలువదు. కావున జోహారుసలిపి పవిత్రతనొంది పరలోకమున నున్న వీరు లగు పతిసుతులఁ గలిసికొనుట యుక్తము. చితులు సిద్ధముచేసి కోట తలుపులు దెఱపింపుము రాజన్నా! ఇఁక వ్యర్థముగా నొక్క ప్రాణియు మరణింపరాదు. జోహారు గోరు సతులను వెంటనే పిలిచికొనిరమ్ము గారీ!" యని మహారాజ్ఞి పలికిన పలుకులకు రాజన్న కలఁతనొంది "తల్లీ! యిదేటిధర్మము? నే నొక్కఁడనే శత్రుసేనలను భస్మము చేయఁగలను. నాప్రాణము లుండగాఁ నొక్కసైనికుఁడును గోటలో నడుగు పెట్టఁజాలఁడు. పరాక్రమముఁ జూపి వైరుల శిరములు చెండాడవలయు నా చేతులతోఁ జితులెట్లు పేర్పింతును దల్లీ!" యని విలపించెను.

"రాజన్నా! నాయాజ్ఞ నీవెన్నఁడును మీఱలేదు. నేఁడును మీఱవీలులేదు. ఇది గురుదేవుల కనభిమతముగాదు. ఇదిగో! యీలేఖయందున్న విధముఁ జూడుము. మనయందలి భక్తిచేఁ గత్తుల నెత్తికొని నిలుచున్న సైనికు లందఱ నస్త్ర ములువీడి యిండ్లకుఁ బొండని నాతుది యాజ్ఞగా నెఱిగింపుము. అంతఃపుర స్త్రీలందఱు వచ్చుచున్నారు. శత్రుసైనికుల ధ్వనులు విజృంభించుచున్నవి." యని రాజ్ఞి రాజన్నకుఁ గఠినముగా శాసించెను. "గురుదేవుల కనభిమతముగా" దన్న వాక్య మాతనికి వాగ్బంధముఁ గావించినది. ఆమె యందిచ్చిన లేఖ నయనముల

కద్దుకొని, 'యంగీ' లో భద్రపఱచుకొని రాజన్న కృతనిశ్చయుఁడై నాఁడు. క్షణములో వేలకొలఁది చితులు తయారైనవి.

నెలల వయసులోని కుమారరాయజగపతిగతి యేమి? అచటి యందఱి మనసులలో నిదే సమస్య. రాగమ్మగారు సోమదేవమ్మగారిని దగ్గఱకుఁ బిలిచిరి. తల్లీ! వత్సవాయ వంశాంకురము నశించిపోకుండఁ గాపాడి పల్లవకుసుమ ఫలశోభితమై దశదిశలఁ బరిమళము వెదజల్లునట్లు చేయు భారము మీది. మావంశమున కెల్లప్పుడు సేమముఁగోరుచు సోమయాజులుగారు మాకుఁ బెట్టనికోటయై వర్తిల్లిరి. ఈ యంత్యసమయమున వందనము లర్పించుటకన్న మఱేవిధమునను వారి ఋణముఁ దీర్చుకొనఁజాలను. మా యీ చిట్టిబాబే యీ ఋణభారము దీర్చుకొనఁగలుగు సుదినము వచ్చుఁగాక" యని పలుకుచుండ నామె నయనములనుండి సంతతధారగా నశ్రుకణములు జాలువాఱుచుండెను.

"మీవలన నీయశేషప్రజ శాంత్యానందములఁ దూఁగుదూఁగినదానికన్న మాకుఁ గావలసిన యుపకృతి యేమి? ఈ పున్నమచంద్రుఁడు నేటినుండి నాబిడ్డఁడు, నాపతి, నాదైవము, నా సర్వస్వమును. లోక సంరక్షక మగు నీ క్షాత్త్రమును గాపాడుటలో నాదేహము వేయి తునుకలైనను బాధలేదు." అని సోమదేవమ్మగారు పలుకుచుండ; నంతవఱకుఁ జేతనరహితమైన బంగరుబొమ్మవోలె నొడిలో వాలునిడికొనియున్న రామయమ్మాదేవి లేచెను. ఆమెచేతు లప్రయత్నముగా ముందు

నకు సాగినవి. చాఁచిన హస్తములనుండి బాలుఁడు సోమదే వమ్మగారికరములఁ జేరినాఁడు. రామయమ్మాదేవి కన్నులనుండి రెండు కన్నీటిబిందువులు శూన్యహస్తములలోఁ బడెను. ఆమె నోటివెంట మాటరాలేదు. ఇంతలో దాసి తెచ్చిన పసుపుఁ గుంకుమము లామె ధరించెను. ఆమె మానసమందలి శోకపు మబ్బు లొక్కక్షణములో విచ్చిపోయెను. ఆమెచుట్టు నమితమైన తేజము గ్రమ్ముకొనెను. పెండ్లిపీఁటలమీఁది కేఁగు నూతన వధువువోలె నామె చితిసమీపమున కేఁగెను. రాజన్నయు, సోమదేవమ్మగారు నాతావునుండి కదలిరి.

కోటద్వారముల తలుపులు విచ్చినవి. శత్రుసైనికులు కోలాహలములతో దుర్గములో నలుమూలలఁ గ్రమ్ముకొనిరి. ముఖ్యులగు సరదారులందఱు రాజభవనమువైపున కుఱికిరి. అచటఁ బావకుఁడు మహోజ్వాలాభీలముగ వెలుఁగుచుండెను. చుట్టుపట్టుల నెచటఁజూచినఁ బసుపుఁగుంకుమలు, హారిద్రాక్షతలు, రంగురంగుల పూలు, పచ్చని మామిడితోరణములు.

అది యుత్తమ లలనారత్నములు జోహారొనరించిన పుణ్యభూమియా? వీరవరేణ్యుల కల్యాణ మంటపమా? ఆజ్వాలలు పెద్దాపుర పుణ్యాంగనల స్వర్గసోపానాధిరోహణ జయపతాకములా? రుస్తుంఖానునిపై విజృంభింపఁబోవు కాల సర్పపుఁ గ్రూరజిహ్వికలా?

బాలజగపతిని, నపరోధమును బంధింప నువ్విళులూరుచుఁ గోట యంతయుఁ గలయఁదిరిగిన రుస్తుంఖానునకుఁ దీఱని

యాశాభంగము. ఒక్క కులాంగనదర్శనముకూడ నాతనికిఁ గలుగఁలేదు. అవసరమైన సింహాసనమును, లేకున్న చితిని నధిరోహింపఁగల సాహసికురాండ్రా యీ యాంధ్రాంగనలు? ఖానుఁనకు లభించినది జయలక్ష్మియా? ఆశాలతలను సమూలముగా ద్రుంచివైచిన నిర్భాగ్యదేవతయా? ఎవరు నిర్ణయింప శక్తులు?

---

# 14. మిత్ర సమాగమము

"నమస్కారములు"

"నమస్కారములు రామశాస్త్రిగారూ! చిరకాలమునకుఁ గానఁబడిరి. ఇప్పటివఱ కెచట నుంటిరి? విశేషములేవియు లేవుగద! మీకాశీవిద్య యెంతవఱకైనది?"

"కృష్ణావధానులుగారూ! విశేషములకేమి? ఏవియో యుండక మానవు. కాశీక్షేత్రమున కేఁగి వ్యాకరణ పూర్వోత్తర మీమాంసలయందలి రహస్యవిశేషములు చదివి వచ్చితిని. గురుకటాక్షమునకు నమస్సు లిడి కృతజ్ఞతఁ దెలుపుటకై బయిలుదేఱి వచ్చుచుంటిని."

"ఓహో! అలాగుననా? ఈమధ్య దేశములో లేరన్నమాట. అయిన విశేషములు చాల వినవలసి యుందురు."

"కొంతవఱకు వినకపోలేదు. రాజమహేంద్రవరముఁ జేరుసరికిఁ గొన్ని సంగతులు దెలిసినవి. భీమేశ్వరదర్శనముఁ

జేసికొని, పెద్దాపురముఁజేరి యథార్థవృత్తాంతము లరయ వలయు నను నూహతో నిచటికి వచ్చితిని."

"అవును. ఎవరికిని దెలియనివి గావు జరిగిన విశేషములు. జరుగువఱకుమాత్ర మెవ్వరు నూహింప లేకపోయిరి. ఇటీవలనైనను సత్యాంశములు తక్కువగను, గల్పితపు సంగతు లెక్కువగను బ్రచారమగుచుండుట మామూలే. ఇచట మన మెంతసేపు మాటలాడుకొన్నను వినువారులేరు. గమ్యస్థానము నెక్కువదూరము గాదు. కూర్చుండుఁడు."

ఉభయులు భీమేశ్వరాలయ సమీపమున నున్న యొక తోఁటలోఁ గూరుచుండిరి. ఉభయులు సుబ్రహ్మణ్య సోమయాజులుగారి శిష్యులు. రెండేండ్లయి శాస్త్రిగారు కాశీవిద్యాభ్యాసమున కేఁగిరి. వ్యాకరణ మీమాంసా శాస్త్రములు పెద్దాపురమునఁ బూర్తిచేసినను, గాశిలో శాస్త్రరహస్యము లెఱిఁగిన మహోద్దండ పండితులయొద్దఁ గొన్ని విశేషపు మెలఁకువ లెఱుంగుట మంచిదనియుఁ, దీర్ఘయాత్రవలనఁ గొంత లోకానుభవము గలుగుననియు సోమయాజులుగారే శిష్యునిఁ గాశీప్రయాణమునకుఁ బ్రోత్సహించిరి.

కృష్ణావధానులుగారు వేద శ్రౌత స్మార్త విద్యలు ముగించుకొని, సామాన్య సంస్కృత సాహితిని సంపాదించుకొనిరి. భీమేశ్వరమున వసించుచుఁ గుటుంబ యాత్ర సాగించుచుండిరి. శాస్త్రిగారు కాశీలోఁ దమకృషి ముగించుకొని, కృష్ణాతీర మందలి స్వగ్రామమునకైన వెడలక,

ముందే గురుదర్శనము గావింపవలయునని రాజమహేంద్రవరము మీఁదుగాఁ బెద్దాపురమునకుబయలు దేఱిరి. భీమవరమున స్వామి దర్శనముఁ జేసికొని మిత్రులయింట భోజనాదికము ముగించుకొనిరి. పెద్దాపురముఁ జేరుటకై పది యడుగులు వైచుసరికి 'నమస్కారము' లనుచుఁ గృష్ణావధానులుగారు కలిసికొనిరి.

మెత్తని లేఁబచ్చికపై నిరువురు మిత్రులుఁ గూరుచున్న యనంతరము కృష్ణావధానులుగారు సాకల్యముగాఁ బెద్దాపుర వృత్తాంతము వినిపింప నారంభించిరి.

రుస్తుంఖానుని మోసపు రాయబారము, రాజకుమారుల దుర్మరణము, నంతఃపురకాంతల జోహారు, బాలజగపతిఁ దీసికొని సోమదేవమ్మగారు పయనమగుట మున్నగు విషాద గాథలు చెప్పుకొలఁది, వినుకొలఁది వారి యుభయుల కనుఁగొలఁకుల నుండి యశ్రుకణములు చిందుచునే యుండెను. ప్రసంగవశమున రాఘవమ్మాదేవిగారి యౌదార్యము జ్ఞప్తికి వచ్చి రామశాస్త్రిగారీ క్రింది వృత్తాంత మవధానులుగారికిఁ దెల్పిరి.

"నేను విద్యాభ్యాసమునకై కాశీపురి కేఁగ నిశ్చయించితిని; గాని నాయొద్ద ఖర్చులకై యొక చిల్లిగవ్వయు లేదు. ఎవరేమొసంగినను బరిగ్రహింపక శక్తికొలఁది దూరాగతులగు శిష్యుల కన్నదానముసేయుచున్న గురుదేవులుమాత్రము ఖర్చు భరింపఁ గలుగుదురా? కలిగినను నేనెటు లంగీకరింపఁగలను?

ఒకనాఁడు గురుదేవులతో దర్బారున కేఁగితిని. మహారాజ్ఞియుఁ, గుమారులు మమ్మెంతో యాదరించి విద్యాభ్యాస

మునకుఁ జెందిన ప్రసంగముతోఁ గొంతకాలము గడపిరి. ఆ తిమ్మజగపతి వయసునఁ జిన్నయయ్యు నెంత ప్రజ్ఞావంతుఁడో కాని యాయనకుఁ దెలియని సంగతులే లేవా? యనిపించెను. 'కళా తిమ్మజగపతి' నామ మాయనపట్ల ముమ్మాటికిని సార్థకము.

ననుఁ జూచి "యిట్టి పండితులు కాశీనగరమునకు వెడలి సంపూర్ణ శాస్త్రరహస్యము లెఱిఁగివచ్చిన బాగుగా నుండు" నని తిమ్మజగపతి సెలవిచ్చెను. గురువర్యు 'లీతఁడా కుతూహలముతోనే యున్నాఁ' డని యెఱింగించిరి. వెంటనే రాజ్ఞీమణి యయిదువందల నాణెములు వెండిపళ్ళెరమున నుంచి స్వీకరింపవలసినదని నన్నుఁ గోరినది. అంతసొమ్మనవసర మనియు, నాలుగవవంతు మాత్రము చాలు ననియుఁ బలికి దానిని దీసికొన సంశయించుచుంటిని.

ఆమె యంతట లేనికోపముఁ దెచ్చుకొని "పండితుల ఛాందసమిట్లేయుండును. దూరప్రయాణముచేయవలయుఁగదా! అచటఁ గొంతకాలము నివసింపక తప్పదు. లెక్కప్రకారము సొమ్ముఁ దీసికొని, యపుడు చాలకున్న; వెడలినపని యటుంచి ద్రవ్యము కొఱకు వెదకులాడిన నక్కఱకు లభించునా? అదియునుగాక యొక పండితుఁడు సంస్థానసాహాయ్యముతో విద్యానిమిత్తము వెడలినపు డాసాయములో వేఱొకరికిఁ బా లుండఁదగునా?" యని చిఱునవ్వుతో మందలించినది. "మోమోటపడక యేదైన నవసరమగుచో నొకనెల ముందుగనే కబురంపుఁడు. మీకు ద్రవ్యలోప ముండదు. నిశ్చింతులై తదేకదీక్షతోఁ

గావలసిన విజ్ఞాన మంతయు నార్జించివచ్చి, మీ ప్రసంగములచే మమ్మానందింపఁజేయుఁ" డని నన్నామె యుత్సాహపఱచినది.

గురుదేవుల కనుసైగచే మఱుమాటాడక దాని నందుకొని మఱుచటి దినముననే బయలుదేఱి కృతకృత్యుఁడ నయితిని. ఆమె చిత్తశుద్ధి యెట్టిదో కాని, యా ద్రవ్యములోఁ జాల భాగము మిగిలిపోయినది. నా ప్రసంగముచే వారి నానందింపఁ జేయు యోగముమాత్రము నాకు లేకుండ బోయినది." అని శాస్త్రిగారు జొటజొటఁ గన్నీరు రాల్చిరి.

నడుమనడుమ నుత్తరీయముతోఁ గనులొత్తుకొనుచు నవధానులుగా రింక నిట్లు చెప్పిరి. "సోమయాజులుగారి యాదేశానుసారము సోమదేవమ్మగారు బాలు నతినిగూఢముగాఁ గోటఁదాఁటింపఁ దీసికొనిపోవుచుండిరి. శత్రుసైనికు లెట్లో యది పసికట్టి యాటంకపెట్టిరి. చేయునదిలేక తనకుమారుఁడే యాబిడ్డఁడని యామె వారికి నచ్చఁజెప్ప యత్నించెను. వారు వినిపించుకొనక ఖానునొద్దకు బిడ్డనితో నామెను గొంపోయిరి. ఆతఁ డాబాలుని జెఱసాలయం దుంచెను. సోమదేవమ్మగారి దీర్ఘప్రార్థనవలన నామెయు నాబాలునితోఁ జెఱసాలయం దుండుటకును, నేదైన పనియున్న ననుమతితో వెడలివచ్చుటకును నంగీకరించి, ఖానుఁడు తీఱికసమయమున బాలునిఁ దన యొద్దకు రప్పించి వినోదముగాఁ గాలముఁ బుచ్చుచుండువాఁడు.

ఒకనాఁ డాబాలునిఁ దీసికొనివచ్చిన తరువాత రుస్తుంఖానుఁ డొక చిత్రముఁ జేసెను. ఒకకత్తి, వేఱొక ఫలము,

మఱొకపుస్తకము మఱియుఁ గొన్ని యాటసామానులు నొక చోట నుంచెను. బాలు నొకసారి యెత్తుకొని లాలించి యావస్తువులఁ మీఁదికి వదలి యేదో యొకటి తీసికొమ్మని చెప్పెను. ఆతఁడు వడివడిగాఁ బోయి, యావస్తువు లిటునటు జిమ్మివైచి, వెనుకనున్న కత్తి చేతఁబట్టి, ఖానునివైపునకు దానినెత్తి జళిపించెను. ఖానుఁ డాశ్చర్యపడి యాబాలుఁడు తప్పక రాజకుమారుఁడే కావలయునని నిశ్చయించెను. నాఁటికి మరలఁ జెరసాలకంపి మిగులఁ గట్టుదిట్టములు గావించెను." అని కృష్ణావధానులుగారు చెప్పఁగా విని రామశాస్త్రిగారు "క్రూరాత్ముఁడైన రుస్తుము బాలునిఁ జంపకుండుట విచిత్రమే" యని పలికిరి.

అవధానులుగారు మరల నందుకొని "లోకములోఁ బరిపూర్ణసుకృతాత్ముఁడు, నట్లే సంపూర్ణదుర్జనుఁడు నుండరు. ఏవో కొన్ని సుగుణములు మహాదుష్టునియందు నుండును. ఒకటు రెండు దోసఁగులు సుజనునియందుఁ గాన నగును. అదియునుగాక రుస్తుంఖాను రాజనీతిచతురుఁడు. పెద్దాపుర పాలకుల యెడలఁ బ్రజానీకమునకుఁ గల భక్తివిశ్వాసము లాతఁడు స్వయముగా నెఱుంగును. మఱియు నిచటివీరవరే ణ్యుల క్షాత్త్రతేజ మాతఁడు మఱచిపోలేదు. కావున వీలయి నంతవఱకుఁ బ్రజల కాగ్రహముఁ దగ్గింపవలయునని యాతని యాశయము. కోట వశపడగాఁనే సైనికు లందఱు దోఁచు కొనుట కనుజ్ఞఁ గోరిరి. దాని కాతఁ డంగీకరింపలేదు. బహి

రంగముగా బాలునిఁ జంపినఁ; బ్రజల కందఱ కుద్రేకము గలిగి తిరుగఁ బడవచ్చును. మరలఁ గొంతసైన్యము నష్టమగును. అది యాతని కిష్టముగాదు. బాలునిఁ జంపకుంచుట కింకొక కారణము గూడఁ గలదు.

సోమదేవమ్మగారు చెఱసాలలోనికి వచ్చుచుఁ, బోవుచు రుస్తుముఖాను 'జనానా' తో స్నేహముఁబెంచుకొని, పాటలు పాడుచుఁ, గథలు చెప్పుచుఁ గొంత వినోదముఁ గల్పించు చుండెను. ఖానుని భార్యయు సోమదేవమ్మగారితోడి పరిచయ ముచే బాలుఁ డామెసుతుఁడే యని నమ్మి బాలుని కేహానియుఁ జేయవలదని భర్తను వేఁడుచుండెను. ఈ విధముగాఁ రాకొమ రున కాయువు పెరుగుచుండెను." అని వృత్తాంతము ముగించిరి.

"ఇపుడు గురుదేవులెచట నున్నట్లు? నాకు వారి దర్శ నముఁ జేయుట కవకాశ మున్నదా, లేదా?" యని శాస్త్రి గారు ప్రశ్నించిరి.

"గురుదేవు లొకచోట నుందురని స్పష్టముగాఁ జెప్ప లేము. పెద్దాపురములో వారిదర్శన మగుట కల్ల. ఈవల నీబాలుని, నావల రాజానగరమున బంధింపఁబడియున్న నూరు ద్దీనుని, విడిపించుట వారి తొలికర్తవ్యము" అని యవధానులు గారు శాస్త్రిగారికి దగ్గఱగా జరిగి చెవిలోఁ గొంతసేపు గుస గుసలాడిరి. అనంతరము 'రాజమహేంద్రవరమున మీరు విన్న యుదంతములెవ్వి?' యని ప్రశ్నింప; శాస్త్రిగారు "పెద్దాపుర మును గుఱించి యించుమించు మీరు చెప్పిన సంగతులకన్న

నెక్కువయేమియులేవు. ఆరోగ్యాశ్రమవృత్తాంతము మీరెప్పుడైన విన్నారా? యని యవధానులుగారిని బ్రశ్నించిరి.

"ఎఱుఁగకేమి? ప్రజాసేవాభిలాషులు, సమర్థులు నగు దాసుగారికి మంత్రిత్వ మొప్పగించి తాము విశ్రాంతిగైకొనఁ దలఁచి గురుదేవులు వారి దర్శనమొనర్చియుండిరి. కాని 'ప్రజా సేవకు మంత్రిత్వము ప్రధానముగా' దను భావముతో దాసుగా రంగీకరింపలేదు" అని యవధానులుగారు బదులు వల్కిరి.

మరల రామశాస్త్రిగా రందుకొనిరి. "దాసుగారి యాశ్రమపు టునికి యెప్పటికైనఁ బ్రమాదకరము. వారి నెటులైన లోఁగొన్నచోఁ గొంత నైతికవిజయము లభించును" అని తలఁచి యొకనాఁడు రాయబారివేషమున రుస్తుంఖానుఁడు స్వయముగా దాసుగారియొద్ద కేఁగెను. "రుస్తుంఖాను హృదయమున హైందవులయు, మహమ్మదీయులయు నైకమత్యముఁ, బ్రజాసౌఖ్యముఁ దప్ప మఱెట్టి యూహాలును లేవు. ఆతని యాశయములు సాగునట్లుగాఁ దాము మంత్రిత్వము వహింపవలయు నని కోరుచున్నాఁ" డని దాసుగారితో విన్నవించె నఁట. చిఱునవ్వు నవ్వి "నేను బ్రజాసేవ కొక విధానము నిర్ణయించుకొనియుంటిని. నామానస మిఁక మాఱుదారులకు మఱలదు" అని దాసుగారు సమాధాన మిచ్చిరఁట. రుస్తుంఖానుఁ డాయనను విశ్వసింపలేకపోయినాఁ డఁట. అపుడపుడు రోగులకు, నాశ్రమమునఁ బనిసేయువారికి నాటంకములు

గల్పింపుఁడని తన సైనికుల కాజ్ఞాపించెనఁట. ఒకనాఁడు తెల్ల వాఱుసరి కాశ్రమమున నెవ్వరును లేరఁట.

దాసుగారి యంతర్ధానము గుఱించి యంద ఱన్ని విధములుగాఁ జెప్పుకొనుచుండిరి. రుస్తుంఖాను సైనికులే దానికిఁ గారణమైయుందు రని చాలమంది యభిప్రాయము. నేనొక ముస్లిముసైనికునివలన నొకవిషయము వింటిని. దాసుగారి మందిరమున నొక లేఖ దొరకినది. అది సంకేతాక్షరములతో నిండియున్నది. "దాసుగారు బుద్ధిపూర్వకముగనే తమమహిమ వలన నదృశ్యులై హిమాలయములకుఁ బోయిరి. కాలాంతరమున ననఁగా రెండు శతాబ్దముల యనంతరము కలిదిండి రామరాజుగారి మండలమున జన్మించి, ప్రస్తుత మాశ్రోగ్యాశ్రమ మున్నతావుననే తిరిగి యాశ్రమము నిర్మించి, రోగపీడితులగు ప్రజలకు సేవ చేయఁగలరు" అనునవి యా లేఖయందలి యంశములఁట. ఇట్లు చిత్రవిచిత్రముగ జనులు చెప్పుకొను వానిలో నేయది నిక్కమో యెవ్వఱు నెఱుంగరు. ఆశ్రమ ప్రదేశమున నొక్క ప్రాణియు లేని సంగతి నేను స్వయముగాఁ జూచితిని" అని తెలిపి రామశాస్త్రిగా రింకను బెద్దాపురమునకుఁ బోయిన నేమైన సంగతులు దెలియునని యవధానులుగారి సెలవునంది ముందుమార్గమువట్టిరి. అవధానులుగారును నెమ్మదిగా నింటికిఁ జనిరి.

---

# 15. ప్రతిజ్ఞా నిర్వహణము

ఆశ జీవితమునకుమూలము. అదిలేని మానవుఁడుండఁడు. ఆయాశతోఁ బ్రతి మానవుఁడును గొన్ని యత్నములు సాగించును. ఫలించినచోఁ దనప్రజ్ఞయని గర్వించును. ఫలింపనపుడు దైవసాహాయ్యము లేదని చింతించును. ఇతరు లాటంకమైరని నిందించును; పరితపించును. ఇది సామాన్యులగతి. కొందఱు వివేకవంతులు దీనికి భిన్నముగా నుందురు. ఈ యిరుతెగల వారుఁ గొంచెము సంఖ్యాభేదముతో నేకాలమునను నుందురు.

కుమారుఁ డనియైన నెంచక రుస్తుంఖానుఁడు నూరుద్దీనుని రాజానగరమున బంధింపఁ జేసెను. రాకొమరులఁ జిత్రవధపా లొనరించి పెద్దాపురముకోట వశపఱచుకొనెను. సైన్యముఁ గట్టుదిట్టము చేసికొని మరల నలువదివేల వఱకును సజ్జీకరించుకొనెను. కోట దాఁటిపోవుచున్న రాచకూనను గూడ బంధించియుంచెను. నైజాము ఢిల్లీని ధిక్కరించినట్లే తాను నైజామును, ఢిల్లీని ధిక్కరించి యాంధ్ర సామ్రాజ్యము శాశ్వతముగా నేలవలయునని యువ్విళు లూరుచుండెను. సోమయాజి మరణించియుండునని యాతని నమ్మకము. ఇఁకఁ దనదారి కడ్డు లేదు. నైజాము సేన లంపిన ; వానిని 'జిత్తు' చేసివైచు టొక్కటే మిగిలినపని. తన రేఖ నేఁడు ఫలించినది. కుమారుఁ డెప్పటికైన దారికిరాకమానఁడు. రాచ నిసువు పంజరములోనిపిట్ట. ఒకదినము వెనుకనో, ముందో

యేదో వంకఁబెట్టి తుదముట్టింపవచ్చును. ఇట్టి యాలోచనతో నొకనాఁటి యర్ధరాత్రమునఁ దాను విడిసియున్న భవనపువసారాలో నిటునటుఁ బచారుచేసి, నిదుర రాక రుస్తుంఖానుఁ డొక యున్న తాసనముపైఁ గూరుచుండెను.

అపు డాతనికనుల కొక భీషణాకృతి గోచరమయ్యెను. అది సచేతనమా? చిత్రగతమా? మూఢులు పిశాచముల నమ్మెదురు. అది వారి పిశాచమా? అట్టి భయంకరాకృతిని రుస్తుము తన జీవితములోఁ జూచియుండలేదు. ఆలోచనలో నుండఁగనే యాకస్మికముగాఁ బ్రత్యక్షమైన యా యాకృతి క్షణములో దగ్గఱకువచ్చి, యెడమచేత రుస్తుము కంఠము నదిమిపట్టి, రెండవచేతితో నొకబాఁకు గుండెలకు సూటిగా నిలిపియుంచెను. రుస్తుంఖాను భ్రాంతుఁ డయ్యెను. నోట మాట వెలువడుటలేదు. రాజానగరమునఁ జెఱ నున్న యిూశని నెవ్వరు విడిపించిరి. సోమయాజి జీవించియుండెనా? ఇతఁడు వేలకొలఁది సిపాయిలచే రక్షితమయిన కోటయం దెట్లు చొఱఁ గల్గెను? ఆలోచనలో నూఁగులాడుచున్న తండ్రితో నూరుద్దీ నిట్లు పలికెను. "మూర్ఖా! నేను రాజకుమారులను విడిచి వెడలునపుడు చేసిన హెచ్చరిక జ్ఞప్తికిరాలేదా? కంఠపుఁ బట్టు విడుచుచున్నాను. 'అల్లా' ను స్మరించుటతప్ప నింకేమి పలికినను నీనాల్కను చీల్చివేయుదును. నన్నుఁ బూఁటగా నిడి పంపిన పసినివులఁ జంపిన; ననువధించుట కాదా? పవిత్ర మహమ్మదీయ వంశపుఁ గీర్తికిఁ గళంకముగాదా?

పసినిసువుల మెడలు నులుముటకు నలువదివేలసైన్య మేల? కాల్పనా? నీ వింకను దప్పించుకొనుటకుఁ జేయుయత్నములు వృథా. నిన్ను ద్వంద్వయుద్ధమున జయింపలేని పిఱికిపందను గాను. పాపి వగు నీకు రణమరణమహాయోగము పట్టుట నా కభిమతముగాదు. రాజపుత్రుల చేతులఁ గత్తులు హరించికదా నీవు వారిని వధించినది"

"కుమారా! రక్షింపుము. నీయిచ్ఛ వచ్చినట్లు చేయుము. నన్నుఁ జంపకు" మని తండ్రి నూరుద్దీనుని పాదములపైఁ బడిపోయెను. నీయెత్తులు, జిత్తులు నా కీకఁ బనికిరా" వని నూరుద్దీను ఖడ్గ మెత్తెను. "రక్షింపకున్న: నా వలెనే నీవును మరణింతువు. నావలె రాజ్యకాంక్ష నినుఁ బీడించుఁగాక!" అని పలుకుచున్న రుస్తుంఖానుని గుండెను నూరుద్దీనుచేతి ఛురిక చీల్చివైచెను.

"నాప్రతిజ్ఞ నిలుపుకొంటిని. ప్రభుఋణముఁదీర్చుకొంటిని. 'నూరుద్దీను ద్రోహి. తండ్రితోఁ గలిసి శిశువులఁ బొట్టఁబెట్టుకొన్నాఁ' డను నింద నా కీక ముమ్మాటికిని రాదు" అని తృప్తి నొంది నూరుద్దీను చరచర భవనపుఁ బరిసరము విడిచిపోయెను.

---

## 16. విముక్తి

కష్టసుఖములు, శీతోష్ణములు మున్నగునవి ద్వంద్వములు. పరివర్తన సమేతములు. లోకమున నసంభవ మను

నదిలేదు. రుస్తుంఖానునిచర్యలు, నూహాలు గ్రహించి నలువది వేలసేన యొసఁగి పంపుటలోని యనౌచిత్యమును నైజాము గుర్తించినాఁడు. నిలుచున్న పాటునఁ దిరిగిరమ్మనివార్త లంపినాఁడు. తాను నేర్పినవిద్యయే రుస్తుంఖానుఁడు తిరిగి తనకొప్పగించినాడు. "ఇపుడు రుస్తుంఖాను పెద్దాపుర సంస్థానమునకు సర్వస్వతంత్రాధిపతి. ఆతఁ డెవ్వరికిని విధేయుఁడు గాఁడు" ఇది యాతని ప్రత్యుత్తరము. ఖానుని సాధించుటెట్లు? అన్వారుద్దీనును దొలగించి యీతఁ డేదో నెత్తి కెత్తు నని కదా! యింతగౌరవ మొసఁగినది. రుస్తుమును దండింపుమని యిపుడా యన్వారుద్దీనునిఁ బంపుటెట్లు?

నైజాము ప్రభు వీయాలోచనములలో నుండఁగా నూరుద్దీను తండ్రిని వధించినవార్త చెవులఁబడెను. ఇంతటితోఁ బనితీఱినదా? ఆంధ్రరాజ్యములను లోఁగఁదీసికొని కప్పము వసూలుచేయు విధాన మేమి? నూరుద్దీనుసకే సర్వాధికార మొసఁగి సర్లష్కరుగా నియమించిన? "అతఁడు యువకుఁడు. ఉత్సాహవంతుఁడు. సాధారణముగా మాట యిచ్చినఁ దిరుగఁడు" అనితలంచి, రుస్తుంఖానున కాతఁడుచేసిన ప్రతీకారమును దానామోదించినట్లును, రాజమహేంద్రవరప్రాంతముల కాతని సర్లష్కరుగా నియమించినట్లును, నుత్తరువు వ్రాయించి నైజాము ప్రభువు తగినవారిచే దానిని నూరుద్దీనున కంపెను.

కాలగమనము విచిత్రము. ఎప్పుడే పరిస్థితు లెట్లు మాఱునో యెవ్వరు నెఱుంగరు. తనయుక్తివిశేషమున

బాలునిఁ దప్పించి విజయనగరమున బంధువులకడఁ జేర్పఁగల నను గట్టినమ్మకముతో సోమదేవమ్మగారు మహారాజ్ఞికి వాగ్దానము చేసిరి. అనుకొన్నప్రకారము తమశక్తియుక్తు లన్నియుఁ బ్రయోగించిరి. ఆచారములకుఁ దిలోదకము లిచ్చిరి. "ప్రథమ కబళమున మక్షికాపాత" మనునట్లు కోట దాఁట కుండఁగానే బంధనము ప్రాప్తించినది. ఉపాయములన్నియు బాలుని ప్రాణరక్షణమున కుపయోగపడినవి. విముక్తి కవకాశము గానఁబడుటలేదు.

కథలచేతను, పాటలచేతను గావలిసైనికులఁ గొంతవఱకు సోమదేవమ్మగారు లోఁగొనఁ గలిగిరి. అంతమాత్రమున దప్పించుకొనుటెట్లు ? ప్రయత్నము వెల్లడియై విఫలమైనచో నిఁక రాజసుతుని యసువులు నిలుచుటకల్ల. ఆవల విజయనగరము వారెంత సిద్ధముగా నున్నను, ధనసాహాయ్య మెంతచేసినను; గాలము కలిసివచ్చిననే కాని కృషిఫలింపదు. అట్టి సుసమయము వచ్చువఱ కెన్నియిడుమలకైనఁ దలయొగ్గవలసినదే. ముప్పదిమూరల చీర మడచి, నడుమునకుఁ జుట్టుకొని మిషతో మాటిమాటికి కోటవెలుపలికి వెడలివచ్చుచుండ వలసినదే. భటు లంతదూర మేల పోవలయు నన్న ; నది తనకుఁగలరోగ మనియుఁ గోటలోనే కూరుచున్న; జోహారొనరించి దయ్యములైన రాచపిశాచులు మీఁదఁబడి పీడింతురని బొంకుచుండ వలసినదే. ఈపాటులన్నియు క్షమాదేవిని మించిన లక్ష్మీస్త్రీ సోమదేవమ్మగారుతప్ప మఱెవ్వరు పడఁగలరు ? ఆమె తన

పతిజ్ఞ వీడి, లోకశ్రేయము మంటఁగలిపి యిహాపర యశో
హాని నెట్లు కలిగించుకొనును ?

"దుర్మార్గుఁడు రుస్తుంఖాను కడతేఱినాఁడు. రాజ
పమారుల బహిఃప్రాణమైన నూరుద్దీను సర్ లష్కరై పెద్దా
పురమున నుండియే యేలుబడి సాగించుచుండెను. ఈతఁడు
తప్పక రాజశిశువును విడిచిపుచ్చి మేలుచేయు" నని యెల్లరు
నమ్మిరి. వెంటనే విడిచిపుచ్చినచో నైజాము కోపించు నేమో
యని యాలస్యముచేయుచున్నట్లు కొంతకాలము తలపోసిరి.

దైవ మందఱియూహలు గల్ల లొనరించి వైచెను.
తండ్రివలెనే నూరుద్దీనును నైజామువశమున నుండ నిచ్చగిం
పక స్వతంత్రముగాఁ బరిపాలన మొదలిడినాఁడు. పెద్దాపుర
మును రాజవంశమున కొప్పగించు నూహా కేమియు నాతఁ డెడ
మీయలేదు. చెఱసాలలోని పసివానిని వీలయినంతత్వరలో
నంత మొందించి తనదారి నిష్కంటక మొనరించుకొనఁ దలఁచి
నట్లు సోమదేవమ్మగారికిఁ దట్టినది. తండ్రికన్నఁ గడుమెలఁ
కువతోఁ గారాగార రక్షణాదికమున నాతఁడు ప్రవర్తించుటఁ
జూచి, యిఁకఁ గొలఁదిదినములలో బాలునిఁ దప్పింపకున్న
హానితప్పదని యెంచి సోమదేవమ్మగారు రేలుంబవళ్లు లప్ర
మత్తతతో యత్నించుచుండిరి.

ఒకవంక నైజామునకు నూరుద్దీనునిపైఁ గ్రోధ మతిశ
యించుచుండెను, నూరుద్దీను చాలకాలము విశ్వాసముతోఁ
బ్రభువులను సేవించియున్నందునఁ గొందఱు స్థానికుల యభి

మానముఁగూడఁ జూఱగొనఁగలిగెను. మఱియుఁ దాఁజేయు యత్నములన్నియు సంస్థానాభివృద్ధి నిమిత్తమే యని చాలమం దిని నమ్మింపఁగలిగెను. కావున నేమిచేయుటకును బాలువోవక యాతని దండించుటకై నైజాముప్రభు వెదురుచూచుచుండెను.

ఆశ కంతము లేదు. దాని నాధారపఱచుకొనియే పెక్కుమంది తాము దలపెట్టిన సాహసకృత్యములు చేయఁ గలుగుట. అచిరకాలములోఁ బెద్దాపురసంస్థానమును, రాజ మహేంద్రవర దుర్గమును బలపఱచుకొనుటే కాక రాజ్యవిస్త రణ లాలసుఁడై యొకనాఁడు నూరుద్దీను కళింగవిజయమునకై స్వయముగాఁ బెద్దాపురము విడిచి బయలువెడలెను.

ఓరిమివంటి వస్తు వీ జగతిలో మఱొకటి లేదు. ఓరిమి వహించి యున్నఁ; గొన్ని సమస్యలను గాలమే తీర్పఁగలదు. కాలము వచ్చునందాఁక మానవుఁ డెంత బుద్ధిచాతుర్య ముప యోగించినను సమస్యలపై సమస్య లుత్పన్నము లగుచునే యుండును. లక్ష్మీనరసామ దేవమ్మగారి కిపుడవకాశము చిక్కినది. తన మాటలమంత్రములచేతను, నభినయ చాతురిచేతను గావలిసైనికులను నమ్మించి, వంచించినది. కొన్ని పెంకిపిశా చములను విజయనగరమునుండి తనకందిన సువర్ణపాదుకలతోఁ గొట్టి, లోఁబఱచుకొన్నది. బాలుని నడుమునకుఁ గట్టుకొన్న కోకచుట్టలో గుప్తపఱచి కోటవెలుపలికిఁ గొనిపోయినది. క్షణములో నదివఱ కేర్పాటు చేసికొన్న సంకేతము ప్రకా రము గుప్తస్థలమున వేచియున్న విజయనగరపు గూఢచర

నాయకుల హస్తముల నాబాలు నునిచి బుజములు తడవి చూచుకొన్నది.

రత్నములలో మిళితమై గులకరాలుగూడ నుండును. గాజుపూసలనడుమఁ, బెంటకుప్పల యంతరమున నొక మణి ప్రమాదవశమునఁ బొరలాడను వచ్చును. ముండ్లచెట్టున గులాబిపూలుఁ, బంకమధ్యమునఁ బద్మకోరకములు మనము గాంచుచునే యున్నాము గదా! అట్లే తేజమువెంట నీడయుఁ, జంద్రునిలోఁ గళంకము, నమృతము ప్రక్కను హాలాహలము, నిట్లెన్ని పరస్పర విరుద్ధాంశముల సమ్మేళనమును మనము వినుట కనుటలేదు? ప్రపంచ మంతయు నిట్లు ద్వంద్వభూయిష్ఠమై యుండవలయును.

విజయనగరరాజ్యము పూసపాటి సీతారామచంద్రరాజు గారును, వారి పినతండ్రి కుమారులు విజయరామరాజుగారును బంచుకొని యెవరిభాగము వా రేలుకొనుచుండిరి. సీతారామచంద్రరాజుగారు సర్వవిధములఁ బ్రతిభావంతులు. వారి సోదరులు నట్టివా రేయయ్యుఁ దమకన్న మించిన సీతారామచంద్ర రాజుగారిపట్ల నసూయాగ్రస్తులై యుండిరి. రుస్తుముఖానుచే వధింపఁబడిన తిమ్మజగపతిగారి కీ సీతారామచంద్ర రాజుగారు తోడియల్లుండ్రు. కావుననే రాఘువమ్మగారు జోహారు సేయఁ బోవుచు బాలజగపతిని సీతారామచంద్రరాజుగారి సతీమణి కొప్పగింపవలసినదిగా సోమదేవమ్మగారిని గోరుట. వారిచేతిలో

బాలుఁడు ప్రవర్ధితుఁడై యేనాటికైన రాజ్యపునస్థాపనముఁ జేయఁగలుగునని యాసాధ్వి యాశయము.

బాలజగపతి యదృష్ట మెట్టిదో కాని యాతఁడు జెయిలో నుండఁగనే సీతారామచంద్రరాజుగారును, వారి సతీమణియు దివంగతులయిరి. అసూయాపిశాచావిష్టులై విజయరామరాజుగా రాదంపతులను విషప్రయోగమునఁ దుద ముట్టించిరి. విజయరామరాజుగారికి సంతతి లేదు. కావున బాలజగపతిపట్లను, విషహతుల సుతుఁడగు నానందగజపతిపట్లను వారును, భార్యయగు చంద్రయ్యమ్మదేవిగారును మిక్కిలి యాదరము గలిగి యుండిరి.

ఖానుని దురంతమునకుఁ బూర్వమే సాయముఁ గోరియున్నచో విజయనగరమునుండి గట్టిప్రాపు లభించియే యుండెడిది. సాయమునకై పంపబడిన లేఖలన్నియు ఖానుని చారులు హరించుటవలన యుక్తకాలమున విజయనగరమువారికి వార్త చేరలేదు. తెలిసినప్పటినుండియు బాలునిఁ దప్పించుటకై విజయరామరాజుగారు దగుయత్నమున నుండిరి. దండెత్తి వెడలినఁ; జెయిలో నున్న బాలునిఁ జంపివేయుదురేమో యన్న భయమున నాపనికి సాహసింపకుండిరి. సోమదేవమ్మగారి యొద్దనుండి వార్త లందుకొనుచు వలయు సాయముఁ జేయుచు బాలుఁడు కోట వెలుపలికిఁ జేరిన వెంటనే విజయనగరముఁ జేర్చుట కంచె లంచెలుగా సేనలు నిలిపియుంచిరి.

సోమదేవమ్మగారు రాచబాలునితోఁ గోటవెలుపలి గూఢభటులఁ జేరగానే; వా రతిజాగరూకతతో నామెతోఁ

గూడి హుటాహుటిగాఁ బయనము సాగింపమొదలిడిరి. వారు చాల దూరము వెడలినతరువాత నీవార్త కారాగార రక్షకాధికారుల చెవులఁ బడెను. వారు భయగ్రస్తులై తమమీఁద నేమి ముప్పు వచ్చిపడునోయని "సోమదేవమ్మగా రర్ధరాత్రమున బాలునిఁ దీసికొని పాఱిపోయి" రని దండువెడలిన నూరుద్దీనునకు వర్తమాన మంపిరి. ఆతఁ డత్యాతురుఁడై సేనలు మరలించుకొని, వెనుదఱుముకొనుచుఁబోయి చేఁబ్రోలు కడ విజయనగరపు సేనలను డీకొనెను.

---

# 17. యుద్ధము

తా నొకటి తలఁచిన దైవ మొకటి దలఁచును. అంతయు ననుకూలముగ జరిగిపోవుచున్న దనుకొనుచుండఁగనే యూహింపరాని యాటంకములు గలుగుచుండును. క్రమ్ముకొన్న కారుమేఘములు క్షణములో మహావాయుస్పర్శతో విచ్చిపోవును. శత్రువు లని భావింపఁబడువారు పరిణామమున మిత్రులై యఖండోపకృతి యొనర్తురు. జన్మాంతము మిత్రులుగా నుందురని తలఁపఁబడినవారు మహాశత్రువులై ప్రాణములు దీయుదురు. రామరాజుగారును, సుబ్బన్నగారును, పీఠికాపురాధిపతి కృష్ణారాయనింగారును మన్యపుఁబ్రాంతముల

సైన్యముఁగూర్చుకొనుచుఁ జలిజ్వరము బారిఁబడి మరణించి రని జనులందఱు విశ్వసించుచుండిరి. కాని యచట సేకరించిన యాటవికసైనికులతోను, 'అనకాపల్లిబోయ' లనఁబడు రెండువేలమంది మహావీరభటులతోను విజయనగరము వారి కండయై చేఁబ్రోలు రణరంగమునఁ గృష్ణారాయనింగారు సాక్షాత్కరించిరి.

"తండ్రియగు రుస్తుంఖాను తనయాధిపత్యము పోవుటకుఁ గారణమై, రాజమహేంద్రవరపు సర్ లష్కరై, తుదకుఁ దన్నుఁ, దనప్రభువు నైజాముకు ధిక్కరించెను. గుణవంతుఁడనుకొన్న కుమారుఁడు నూరుద్దీనుకూడఁ దండ్రిని మించిన దిట్టయై తన్నుఁ, దనప్రభువగు నైజామును మరల ధిక్కరించుచుండెను. ఈసమయమున నాతనిపై యుద్ధములోఁ బాలుగొన్నఁ; భ్రాఁతపగలు దీర్చుకొనవచ్చును. మఱియు నూరుద్దీనుని శిక్షింపఁ దలఁచుకొన్న నైజాము మిక్కిలి సంతసించును. నూరుద్దీను నోడించి తఱిమివేయుటేకాక పెద్దాపుర సంస్థానమును వశపఱచుకొని రాజ్యాధికారము వహింపవచ్చును. ఈమేలునకు మాఱుగా నైజాము దీనిని సంతోషముతో నంగీకరింపఁగలఁడు. కానిచో నప్పటి సంగతి యాలోచింపవచ్చును. బాలరాజురక్షణమాత్రమున నాత్రముగానున్న విజయరామరాజుగారికిఁ బెద్దాపురపుఁ జింత యంతేగా నుండదు" ఇది యన్వరుద్దీనునకుఁ గలిగిన దురాలోచనము. ఈయూహతో నైజాముప్రభువు ననుమతి సంపాదించి పదివేల సేనతో

నాతఁడు విజయరామరాజుగారి సేనల సాయమున కయాచిత ముగాఁ జేఁబ్రోలురంగమునకు వచ్చిచేరెను.

ఇఁక రెండవపక్షమున నూరుద్దీను సామాన్యుఁడుగాఁడు. మంచియుత్సాహముగలిగి కొదమసింగమువలె శత్రుదుర్నిరీక్ష్యుఁడై యుండెను. పోయినసేనలు పోఁగా; రుస్తుంఖాను దెచ్చిన సైన్యమును నలువదివేలవఱకుఁ బెంచెను. "పెద్దాపుర రాజ్యక్షేమమే నాపరమాశయము. దాని కెవరే విఘాతములు గల్పించినను గ్రూరముగా నణఁచివేయకతప్పదు. నేను బలవంతముగా యుద్ధములోని కీడ్వఁబడితినే కాని ప్రజా క్షయకారణమైన యుద్ధమును గొని తెచ్చుకొనలేదు" అని తన వాక్చాతురిచేఁ గొందఱు స్థానికుల నమ్మింపఁ గలిగెను. పూర్వమాతని ప్రభుభక్తి యెఱింగినవారిలోఁ జాలమంది యాతని మాటలలోని లోఁతు గ్రహింపఁజాలరు.

ఇంతకును దైవనిర్ణయ మిటు లున్నదేకాని నూరుద్దీను, రాకొమరులు, నీముగ్వురు నొక్కటై రుస్తుము సేనలతోఁ దలపడుటయే జరిగిన నొకటి రెండునాళ్ళకన్న యుద్ధముజరుగవలసినపని యుండెడిదికాదు. ఆమహాసంగ్రామవిజయము దివ్యగంధర్వులు నిత్యమును వేయినోళ్ళతో గానముచేయుచుండెడివారు. ఈయూహ యంతయు నిపుడాకాశసౌధము. "నూరుద్దీను పెద్దాపుర రాజకుటుంబమునకు శత్రువుగా మాఱినసంగతి నిజమా?" ఇది చాలమందిప్రజల ననేకదినములనుండి బాధించుచున్న ప్రశ్న. దీనికి సరియైన సమాధాన మీయుద్ధరంగమే.

అందఱిసందియములు విచ్చిపోయినవి. "క్షీరసాగరమునుండి కాలకూటవిష ముద్భవించుట యెంతసత్యమో యిప్పు డదియు నంత సంపూర్ణసత్యము" అని వారికిఁ దోఁచినది.

ఇరుసేనలకుఁ బోరు ప్రారంభమయ్యెను. వ్యూహము లపై వ్యూహములు మించిపోయెను. నూరుద్దీను తనసేనల కన్నింటికిని సర్వసేనానియై యేకముఖముగా సుశిక్షణముతో యుద్ధము నడిపించుచుండెను. విజయనగరసేనలు త్రివేణీసంగ మమువలె బహుప్రాంతీయసేనల కలయికవలన నేర్పడినవి. విజయరామరాజుగారి సర్వసేనాధిపత్య మంగీకరింపఁ బడినను నవ్వారుద్దీను తనసేనలపైఁ బ్రత్యేకప్రాముఖ్యము వహించి యుండెను. అనకాపల్లి బోయలలో నొక్కొక్కఁ డొకసేనా పతియే. అనఁగాఁ గ్రమశిక్షణరహితముగాఁ జిందఱవందఱగా నుండు వారనికాదు; వా రద్వితీయశూరులు. సహజముగా నగ్రేసరులు. క్రమశిక్షణ విధానమునఁ దప్ప నితరులకు లొంగి యుండ నొల్లని స్వతంత్రులు. కృష్ణారాయనింగా రంకుశము వలెఁ గూడ నుండనిచోఁ గొంత విశృంఖలముగా నుండెడివారే.

ఏది యెటు లున్నను నించుమించు రెండుపక్షముల బలములు నొకదానికొకటి తీసిపోక యీషద్భేదముగా మహా భయంకరముగా యుద్ధము చేసినవి. నూరుద్దీను రణరంగమున నెచ్చటఁ జూచినఁ దానయై వీరవిహారముఁ జేయఁ జొచ్చెను. అతఁడు ప్రత్యక్ష మైనచోట శత్రుసేన రెండుపాయలుగాఁ జీలి యెడమిచ్చుటేకాని ముఖాముఖి నెదుర్కొను ధైర్య మెవ్వరికి

లేదు. "పెద్దాపురమునకు శుభదినములే యున్న; మొదటినుండి యంతయు సవ్యముగానే జరిగియుండెడిది. ఇంతవఱకు వచ్చి యిపు డనుకూలముగా జరుగుట కల్ల" యని పలువురకుఁ దోఁచెను. కృష్ణారాయనింగారు మాత్ర "మనకాపల్లి బోయ లలో నొక్కప్రాణి జీవించియుండఁగా నూరుద్దీ నడుగైన ముందునకుఁ జొచ్చుకొని రాఁజాలఁ" డని ప్రతిజ్ఞచేసి తన సైనికుల నెచ్చరించెను.

విజయరామరాజుగారును దమసైనికులఁ బురికొలుపుచు రణరంగ మంతటఁ దిరుగుచుండిరి. బాలజగపతి రక్షణమే యాయన కన్నిటికన్న ముఖ్యము. శిశువు సురక్షితముగా విజయనగరముఁ జేరిన నాయన యింతలో యుద్ధమే తలపెట్ట కుండెడివాఁడు. యుద్ధముచేసి జయించినను బాలుఁడు రాజ్యము నిర్వహించుకొనలేఁడు కదా! ఈబాలునకు రాగమ్మగారి వంటి మాతృశ్రీ యైన నుండు నదృష్టమేది? అగ్నికణ మాఱిపోకుండ రక్షింపఁబడిన నెపుడో జ్వలింపకమానదు. కావుననే విజయ రామరాజుగా రట్లు తలఁచుట. కాని యాయన కోరిక నెఱ వేఱునట్లు లేదు.

బాలుఁ డున్న సేనాభాగమును విద్యుద్వేగముగాఁ జక్రవ్యూహముతో వచ్చి నూరుద్దీను ముట్టడించెను. ఎట్లైన బాలునిఁ దిరిగి పెద్దాపురమునకుఁ గొనిపోవలయునని యాతఁడు మహాభయంకరముగా విజృంభించెను. జయలక్ష్మి యెవరిని వరించునో సూచనయైనఁ గానరాకుండెను.

నూరుద్దీను మహోత్సాహియై భద్రగజము నెక్కి, మధ్యందిన మార్తాండునివలె మెఱయుచుఁ, దనకెవ్వరు నెదురు నిలువలేక పఱచుచుండ బాలజగపతి యున్నచోటికిఁ బది గజముల దూరమునకుఁ జేరెను. విజయనగరమువారి సైన్యములో హాహాకారము లుప్పతిల్లెను. పులిమీఁద బుట్ర వచ్చి పడెను. అన్వరుద్దీను గాని, యాతని సైనికుఁ డొక్కఁడు గాని, రణరంగమునఁ గానరారైరి. అందఱు రణనిహతులై యుందురా? అసంభవము. విజయరామరాజుగారికి వెన్నెముక విఱిగిపోయినది. అపజయముమీఁద నపజయములు రానిండు; ఆయనకు లెక్కలేదు. కాని బాలునిగతి? "ఇంతవఱకుఁ జేసిన కృషియంతయు విఫలము. సోమయాజి పడినపాటులు బూడిదఁ బోసిన పన్నీరు. ఆయనధీశక్తి యడవిఁగాచిన వెన్నెల." ఎచటఁ జూచినను సేనలో నిట్టూర్పులు, నిట్టూర్పులు; నిరుత్సాహములు.

ఒక్కక్షణములో బాలునిఁ జేతితో నందుకొని తన భద్రగజముపై నెక్కించుకొని వెనుకకు మరలుటకు నూరుద్దీను సిద్ధముగా నుండెను. అనకాపల్లి బోయలకు నేఁడుగదా మంచిపర్వము లభించినది! ప్రతిసైనికుఁడు నొక యక్షౌహిణియై విజృంభించెను. వారి కాక్షణమున నేదియు నసాధ్యముగా గోచరింపలేదు. వారి కంఠరవము లానందమునఁ బొంగిపోయినవి. నికషోపలఘట్టమునఁ గదా సౌవర్ణమాణిక్యములు మెఱయునది! ఒక్కొక్కవ్రేటునకుఁ గొన్ని పరిపంథి మస్తక

ములను గొబ్బరిపుచ్ఛెలవలె నెగురఁగొట్టుచు నూరుద్దీనుని భద్రగజమును ముట్టడించిరి. కొందఱంబారిత్రాళ్ళు నఱకిరి. ఒకవీరుఁడు మహాసాహసముతో నేనుఁగుమీఁది కెగఁబ్రాఁకి తన చేతిఖడ్గముతో నూరుద్దీనుని శిరము ఖండించివైచెను. రెండవ వీరుఁ డాశిరము క్రిందఁ బడకుండ శూలమునఁగ్రుచ్చి పైకెత్తెను.

ఇంకేమున్నది? యుద్ధగతి తలక్రిందులైనది. యవన సైన్యములు వెనుకంజ వేయఁజొచ్చినవి. అనకాపల్లి సైనికులు బాలజగపతిని వ్యూహమధ్యమునుండి తప్పించి విజయనగరము దారిఁ బట్టించిరి. విజయరామరాజుగా రత్యానందముతో రాజసుతుందీసికొని విజయనగరముకోటలోఁ బ్రవేశించిరి.

నూరుద్దీనుని శిరముఁ జూచి యాతని సైనికు లందఱుఁ జెట్టునకొకరుఁ, బుట్టకొకరుగాఁ బలాయన మొనర్చిరి. నూరుద్దీ నొందిన యవస్థకు శత్రువులుకూడఁ గంటఁదడిపెట్టిరి. అన్వారుద్దీను తన పదివేలసేనతో నేఁగి పెద్దాపురముకోట వశపఱచు కొన్న యనతికాలమునకే నూరుద్దీనుని వార్త యచటికిఁ జేరెను. కోటయు, రాజ్యము నేమైనను, బాలుఁడు విజయనగరముఁ జేరినందుల కానందించి విజయరామరాజుగా రాతనిఁ దనసతీమణి చంద్రయ్యమ్మదేవి కొప్పగించిరి. వయసునఁ గొంచెము చిన్నయగు నానందగజపతితోఁబాటు బాలజగపతిని గూడఁ జేర్చి యిరువురను రెండుకన్నులవోలెఁ జూచుకొనుచు నాదంపతులు సుతనిర్విశేషముగాఁ బెంచుచుండిరి.

---

# 18. కృతజ్ఞత

కాలచక్రము విద్యుద్వేగముగ భ్రమించుచుండును. కష్టసుఖములందును, మంచిచెడ్డలందును దానిగతి యొకే తీఱుగ నుండును. తమ యనుభూతులనుబట్టి మానవులు దానిని భిన్నముగ భావించుచుందురు.

చెఱ్ఱ్రోలుయుద్ధము జరిగి రమారమి యిరువదివత్సరము లైనది. దానిఫలితముగా రాయజగపతి రక్షింపఁబడినను బెద్దాపురసంస్థానము మాత్రము కొంతకాలము వఱకు ముస్లిములవశముననే యుండిపోయినది. రాజదంపతు లనురాగమునఁ బెంచినను నానందగజపతియసూయాస్పర్ధలమూలమున జగపతి కపుడపుడు చిక్కులు తటస్థించుచునే యుండెడివి. ఆతఁ డుదయద్భానుఁడువోలెఁ గష్టపరంపరాతిమిరముఁ జీల్చుకొని మహాతేజమున వెలింగెను. విద్యకుఁ దగినవినయము, నమేయపరాక్రమము, దానికిఁ దోడు క్షమాగుణము మున్నగు నన్ని సుగుణములు నాతని యందుఁ బరస్పరాశ్రయములై కాఁపురము సేయఁజొచ్చెను. జగపతిపక్షమునఁ బెద్దాపురమును వశపఱచుకొనుటకై విజయరామరాజుగారు యత్నముఁజేయుచునేయుండిరి. ఈయత్నములో మొదటినుండియుఁ గలిగించుకొని తుదకుఁ గార్యనిర్వాహణదక్షులైనవా రిద్దఱుప్రముఖులు. ప్రభువంశముతోఁ గొన్ని తరములనుండియు సంబంధము గలిగి

సంస్థానాభివృద్ధికిఁ దోడుపడిన వత్సవాయ రాఘవరాజుగారును, గృష్ణనృపాలుఁడును నెడ తెఱపి లేకుండఁ బెద్దాపురము నాక్ర మించిన వారితోఁ బోరు సలిపిరి. వారి కృషి ఫలితముగాను, దమ మహాతేజమునను రాయజగపతివర్యులు దమయిరు వదవయేఁటఁ బెద్దాపురము కోటఁ బ్రవేశించి యచటిప్రజల కానందముఁ గలిగించిరి. పోయినధనము దొరకినట్లు, నమృత వర్షము గురిసినట్లు సంతసించి పౌరు లుత్సవములతోను, జయ గీతములతోను దమప్రభువునకు స్వాగతమొసఁగి గౌరవించిరి.

కల్యాణకాలము వచ్చినపుడు శుభపరంపరలు వచ్చి పడుచుండును. రాజ్యరమాకర గ్రహణముతోఁబాటు కులసతీ పాణిగ్రహణముకూడ నొకేపర్యాయము జరుగుట ప్రజలకెంత యానందదాయకము ! మహావీరుఁడు, నుత్తమవంశసంజాతుఁడూ నగు దంతులూరి రామభూపాలుఁడు చక్కనిచుక్కయు, వినయసౌశీల్యాది సద్గుణవతియు నైన తనపుత్రిక సీతమాంబను శ్రీరాయజగపతివారి కొసఁగి వివాహముచేయ నభిలషించు చున్నట్లు తగుపెద్దలచే వార్త పంపిరి. పెద్దల యభిమతము ప్రకారము కల్యాణమున కన్నియేర్పాటులుఁ గావింపఁబడినవి.

ఈశుభసమయమునకు సుబ్రహ్మణ్యసోమయాజి దంప తులు కడుంగడు వృద్ధులై యుండిరి. బ్రజాక్షేమము, "నావిష్ణుః పృథివీపతి" యను నానుడి మనసులో నిడికొని రాచటికపు రంగమునఁ గొంతకాలము విహారము సలుపవలసి వచ్చినను వారి హృదయము లెల్లపుడుఁ బారమార్థికచింతపైఁ గేంద్రీక

రింపబడి యుండెను. బాలజగపతి విజయనగరరాజదంపతుల హస్తమున సుస్థితిఁ జెందినవెనుకఁ బ్రాపంచిక బంధములకును, రాచఱికపు టొడుదుడుకులకును దూరమగు నొకరమణీయ ప్రాంతమునఁ గతిపయజనములతో నొకయాశ్రమము నిర్మించుకొని వానప్రస్థధర్మమున వారు గాలక్షేపముఁ జేయుచుండిరి.

"స్వయముగా నేగుదెంచి కల్యాణముఁ బట్టాభిషేకమును జరిగింపవలయు" నని జగపతినర్స్యలు, విజయరామరాజుగారు నాదంపతులఁ బ్రార్థించుచు శుభవార్త పంపిరి. సర్వదా జగపతుల శుభమునే కోరుచుందుము. ఈవయసునను, నిప్పటియాశ్రమస్థితిని బర్యాలోచించి పట్టుపట్ట వల" దని సోమయాజులుగారు ప్రత్యుత్తరమంపిరి. తాము పలుశ్రమల కోర్చి సంరక్షించిన మొలక మహావృక్షమై పుష్పించి ఫలించుచుండఁ గన్నులారఁ గని యానందింపవలయునని యాదంపతుల కభిలాష లేకపోలేదు. మరల నేవిషయమునను లాంపట్యము గలిగించుకొనరా దను నూహచేతను, వార్ధకమున శరీరపాటవము చాలవఱకుఁ దగ్గియుండుటచేతను, సోమయాజులుగారట్లు వార్త పంపిరి.

శ్రీరాయజగపతియు నంత తేలికగా వదలలేదు. సోమయాజులుగా రపుడున్న ప్రదేశముచుట్టు నొక యగ్రహారము నిర్మించుటకును, నచట నన్నివర్ణములవారికి, నన్నివృత్తులవారికిఁ బుష్కలముగా సరిపడు మాన్యము లొసఁగుటకును నేర్పాటు గావించెను. ప్రత్యేకముగా సోమయాజులుగారికి

ఫలవంతములగు 'సీనాము' లొసఁగి, యాయగ్రహారపు భూములపై నామమాత్రముగా నున్న పన్నుగూడ వసూలు చేసికొని పుత్రపౌత్ర పారంపర్యముగా ననుభవించు నేర్పాటుఁ జేసెను. రాయభూపాలపురాగ్రహారము లేక లక్ష్మీనృపురాగ్రహార మని యాయగ్రహారమునకు నామకరణము చేయుచు శాసనము వ్రాయించి సిద్ధపఱిచెను. శాసన ప్రకటనము కల్యాణసమయముననో, పట్టాభిషేక సమయముననో కావింప వలయునని ప్రభుని తలఁపు; కాని మనసు మార్చుకొనవలసిన యవసరము వచ్చినది.

శుభసమయమునఁ జేయింపఁదలఁచుకొన్న ప్రకటనల పత్రము నెవ్వరికిఁ దెలియకుండ సోమయాజులు గారికిఁ బంపెను. వృద్ధదంపతులు కోటలోనికి రాఁజాలనందున ముహూర్తము మార్పించి, యీకల్యాణములు వారిసమక్షమున రాయభూపాల పురాగ్రహారముననే జరిగింప నిశ్చయించుకొన్నట్లు సోమయాజులుగారికి విన్నపము వ్రాసి పంపెను. దీనితో సోమయాజులుగారు విజితులైరి. అనుకొన్న ముహూర్తమునకు ముందే యాదంపతులు పెద్దాపురముఁ జేరుకొనిరి.

పెద్దాపుర మంతయు నానందముతో వెల్లివిరిసినది. ఏమెడఁ జూచినను వేడుకలే. పచ్చని తోరణములు, రంగు రంగుల ముగ్గులు, నలంకరణములు, విజయఘోషములు; ఈయుత్సవము తమయింటిలోనిదే యని యందఱిభావము. శాస్త్రవిశారదులు, వేదవిదులు, కవివరేణ్యులు, కళా

వేత్తలు నాహూతులై యరుగుదెంచిరి. నగరమంతయు సకల కలలతోఁ గలకలలాడుచు, నిది యమరేంద్ర నగరమా యని పించుచుండెను. వచ్చినవారందరికి సకలసౌకర్యములకు లోటు లేకుండునట్లు కట్టుదిట్టములు గావింపఁబడెను.

అది పెద్దాపురమున నందరకు మఱవరాని సుదినము. అందఱుఁ జూచుటకు వీలగునట్లుగా సభాస్థలము నిర్మింపఁబడి నది. కల్యాణమండపము కల్యాణములతో నిర్మితమైనట్లే యుండెను. సుబ్రహ్మణ్య సోమయాజులుగారి బ్రహ్మత్వమునఁ గల్యాణము యథావిధిగా జరుపఁబడెను. కల్యాణముపూర్తి యైన వెంటనే పట్టాభిషేకమును గావింపఁబడెను. సోమయా జులుగారు మంత్రపూతమైన గంగాజలము సువర్ణకలశములతో నూతన వధూవరుల శిరములపై నభిషేకించుచుండ వసిష్ఠ మహర్షి శ్రీరామ పట్టాభిషేకము జరిగించుచుండె ననియే ప్రతిప్రాణికిఁ దోఁచినది.

అనంతరము శ్రీరాయజగపతి సతీసమేతముగ రత్న సింహాసనమునుండి లేచి, వేదికపై నిలిచి సోమయాజి దంపతు లకుఁ గైమోడ్పు లొసంగెను. "మీరు నిర్వ్యాజప్రేమతో మావంశమున కొనరించిన మహోపకారము మాటలతో వర్ణింపఁజాలను. నమస్కరించుటకన్న వేఱువిధమున మీ ఋణముఁ దీర్చుకొని మీకుఁ గృతజ్ఞత చూపఁజాలను" అని వినయముతోఁ బలికెను. కనుల నానందాశ్రువులు నిలుపు కొనుట వారికి బహుయత్నసాధ్యమయ్యెను.

మహారాజు నాజ్ఞచేనొక యున్నతోద్యోగి యుచ్చైస్స్వరమున నగ్రహారశాసనము సభ్యులకు వినిపించెను. సభ్యులు జయజయ ధ్వనులతోఁ దమయామోదమును బ్రకటించిరి. "పెద్దాపుర సామ్రాజ్యమునం దంతట సప్తసంతానము లనఁదగిన గృహారామతటాకాదులు నిర్మించుట కేర్పాటు చేయఁబడినది" అను రెండవ శాసనాంశముఁ జదువునరికి 'సెహబాసు, రాజశబ్దము సార్థక' మను ప్రశంసలు మిన్నుముట్టెను. "స్వాతంత్ర్యమే పరమావధిగా నెంచి; యాలుబిడ్డలను, సకలసుఖములును విడిచి, యుడవులపాలై తుద కసువులు ధారవోసిన శ్రీరాజాకలిదిండి రామరాజుగారు, శ్రీరాజపీటి సుబ్బన్నగారును వంద్యులు. వారి పేరు మీఁదుగా రెండన్నసత్రములు శాశ్వతముగా నడుచునట్లేర్పాటు గానింపఁబడినది. మఱియువారిపేరనే సైనిక శిక్షణాలయము స్థాపించి, యువకుల నుత్తేజితులఁజేయ నిర్ణయింపఁబడినది." అను మూఁడవయంశము వినఁబడఁగనే యచటి ముసలివారికి సైతము చేతులు మీసములమీఁదికిఁ బోయినవి.

రుస్తుంఖాను సంస్థానమున నున్నంతకాలము చేసిన సేవ ప్రశంసనీయము. చేఁజిక్కిన బాలుని వధించి, శత్రుశేషము లేకుండఁ జేసికొనుట యాతని కపు డరనిముసముపని. ఆతని యప్పటిదయయే నేఁటికల్యాణమునకు మూలము. నూరుద్దీను ప్రభుభక్తి, ప్రతిజ్ఞానిర్వహణము, శిశుహత్యకుఁ బాలుపడక చెఱలో భద్రముగా నుంచుట మెచ్చఁదగినవి. ఇరువురి స్మరణమునిమిత్తము కోటలోని యుద్యానవన

ములోఁ బాలరాతి విగ్రహములు స్థాపించి, రక్షణమొసఁగుటకు నిశ్చయము గావింపబడినది'' అను తుదియంశము చెవులఁబడు నపుడు శ్రీజగపతి యౌదార్యమునకు, సహనభావమునకుఁ బ్రజలు తలలూఁచిరి.

పలుప్రదేశములనుండి వచ్చిన ముఠాదారులు, ప్రభు భక్తిపరులుఁ, దాముదెచ్చిన కానుకల కిబ్బడిగా బహుమతులు బలవంతముగా స్వీకరించి, ప్రభువుల సెల వొంది తమ యిరవులకుఁ జనిరి. సోమయాజులుగారు మాత్రము 'సభలోఁ బ్రభువుల కెదురాడ జేక యూరకుంటి' మనియు, 'ముక్తికై యత్నములోనున్న మా కీ సంపదలు కొంత ప్రతిబంధక' మనియుఁ జెప్పుకొనిరి. "కొంపెల్లవారు లౌకికోద్యోగ నిర్వ హణచతురులయ్యుఁ బారమార్థిక చింతకు భంగము గలుగ కుండ దేవతలు కరుణించిరి. ఇపుడే కాదు శతాబ్దముల పర్యం తము వారికిట్టి ద్వంద్వశక్తులు మిళితమైయుండు'' నని పలికి కృతజ్ఞతతోఁ దాను గోరిన కోరికను మన్నింపుడని వేఁడు కొని సోమయాజులుగారిచే 'తథాస్తు' అని పలికించి రాయ జగపతి కృతకృత్యుఁ డయ్యెను.

వీరవరేణ్యుఁడు చల్లా రాజన్నయు, వత్సవాయ రాఘవ రాజుగారును, కృష్ణనృపాలుఁడును బ్రభువున కాంతరంగి కులై రాజ్యపరిపాలనమునఁ బ్రముఖస్థాన మాక్రమించిరి.

శ్రీరాజా వత్సవాయ రాయజగపతుల పరిపాలన కాల మంతయు నానందోత్సాహములతో సామ్రాజ్యము కలకల లాడెను. వారి సతీమణి సీతమాంబయు భర్త కన్నివిధముల నుత్సాహముఁ గల్పించుచుఁ బరిపాలనాదికమున సహాయు రాలై ప్రశంసాపాత్రురా లయ్యెను.

సంపూర్ణము.